రాష్ట్ర, సంస్థాన సరిహద్దుల మార్పు: పరిషత్తు చర్చ 3-వ పేజీ

# ఆంధ్రపత్రిక

మలాన్ ప్రభుత్వ విధానంపై స్మట్స్ విమర్శ 4-వ పేజీ

The Andhra Patrika, Madras. Regd. No. M. 1118 Vol. 35 No. 226 FRIDAY 19th NOVEMBER 1948 వెల ఒక అణా Founder: K. Nageswara Rao

# బెర్లిన్ సమస్యను భద్రతా మండలే పరిష్కరించాలి

## పశ్చిమ రాజ్యాల ప్రకటన

### "దిగ్బంధం తొలిగేవరకూ అగ్రరాజ్య సంప్రదింపులు అసంభవము"

పారిస్, నవంబరు 17: అగ్రరాజ్యములు నాలుగు తిరిగి సంప్రదింపులు ప్రారంభించి బెర్లిన్ సమస్యను పరిష్కరించుకోవలసినదిగా నాలుగురోజులక్రితం, ఐక్యరాజ్య సమితి అధ్యక్షుడు గా॥ ఎవాట్ కార్యదర్శి, ట్రిగ్వేలీగారలు చేసిన విజ్ఞప్తికి, బ్రిటన్, అమెరికా, ఫ్రాన్సులు, విడివిడిగా సమాధాన మొసంగుచూ, బెర్లిన్ సమస్యపై సంప్రదింపుల పునః ప్రారంభమునకు, "సోవియట్ దిగ్బంధమే" ప్రబలప్రతిబంధకమని విస్పష్టంచేసినవి.

పశ్చిమ మిత్రరాజ్యత్రయం తమ సమాధానములను, ఐక్యరాజ్య సమితి అధ్యక్షు, కార్యదర్శులకు అందజేసినవి బ్రిటన్, అమెరికా, ఫ్రాన్సులు మూడు ఒకే రకమైన సమాధాన మిచ్చినవి. సత్వరముగా సంతృప్తికరమైన పరిష్కారం లభ్యం కావలెనంటే, బెర్లిన్ సమస్యను యిప్పుడున్నట్టుగా, భద్రతామండలి చేతుల్లో ఉంచుటే మంచిదని, స్పష్టము చేసినవి.

"ముఖాముఖి సంప్రదింపుల ద్వారా బెర్లిన్ సమస్యను పరిష్కరించుటకు బ్రిటన్ విశ్వప్రయత్నం చేసినదని కాని, మాస్కో సంప్రదింపుల పర్యవసానముగా కుదిరిన ఒడంబడికకు విరుద్ధముగా, సోవియట్ రష్యా, బెర్లిన్‌లోని, తన సర్వసేనానికి ఆదేశము పంపకపోవుటవల్లనే తమ ప్రయత్నమంతా భగ్నమైపోయినదని బ్రిటన్ తన సమాధానములో తెలియజేసెను.

"బెర్లిన్ సమస్యను విచారించుటకు అసలు ఐక్యరాజ్య సమితికి అధికారం ఉన్నదా అని సోవియట్ రష్యా సవాలు చేసినది. అందుచేతనే యీ సమస్యను పశ్చిమ మిత్రరాజ్యత్రయం భద్రతామండలికి నివేదించినది: ఈ విషయంలో సంప్రదింపులు సాగించుటకు సోవియట్ రష్యా 'వీటో' యే ప్రబల ఆటంకంగా ఉన్నది. బెర్లిన్‌కు పడమటి జర్మనీకి మధ్య రవాణా రాకపోకలపైనా వాణిజ్యంపైన ఆంక్షలు తొలగింపబడిన వెంటనే, బెర్లిన్ సమస్యతోపాటు, జర్మనీకి సంబంధించిన ముఖ్య సమస్యలన్నింటిపైనా, అగ్రరాజ్య చతుష్టయ సమాలోచనలకు బ్రిటన్ సమ్మతించునని, బ్రిటిషు ప్రభుత్వం యిదివరలో అనేక పర్యాయములు చెప్పెను" అని బ్రిటన్ తన సమాధానములో స్పష్టపరచెను.

దిగ్బంధన రూపంలోగాని, ఆర్థిక వత్తిడి రూపంలోగాని, మరే విధంగానైనాగాని, పశ్చిమ రాజ్యములను బెర్లిన్ పరిపాలనలో పాల్గొనకుండా రష్యా బల ప్రయోగం చేయవచ్చునా అన్నది బెర్లిన్ సమస్యతో సంబంధించిన ప్రధాన విషయం అని అమెరికా తన సమాధానములో ప్రకటించెను.

## యుద్ధాతరువు ఒడంబడిక కాలపరిమితి

### మిలిటరీ గవర్నరు అభిప్రాయం

సికిందరాబాద్, నవంబరు 17: హైదరాబాద్, భారత ప్రభుత్వముల మధ్య చేసుకోబడి, నవంబరు 29తో అంతమగు యథాతథపు ఒడంబడిక కాల పరిమితి మరొక అరు నెలల వరకు పొడిగించ బడు [illegible] నాకు తెలియదు, అని హైదరాబాద్ మిలిటరీ గవర్నరు మేజర్ జనరల్ చౌధరీగారు చెప్పిరి. [illegible] యథాతథపు ఒడంబడికను [illegible] పరిమితిని పొడిగించు [illegible] అభిప్రాయపడ్డారు. భారత ప్రభుత్వం ఒక [illegible] హైదరాబాద్‌పై పోలీసు చర్యలు [illegible] తర్వాత, ఇక యథాతథపు ఒడంబడిక కాలపరిమితిని పొడిగించుట అన్న సమస్యే ఉదయించదని భావించుచున్నారు.

### చౌధరీ కలకత్తా ప్రయాణం

హైదరాబాద్ మిలిటరీ గవర్నరు మేజర్ జనరల్ చౌధరీగారు యీ నెల [illegible] కలకత్తా వెళ్లెదరు. వారు [illegible] రెండురోజులుండెదరు.

### 5 వేలమంది రజాకార్ల విడుదల

సంస్థానంలోని అన్ని జైళ్లనుండి యిప్పటికి సుమారు 5 వేల మంది రజాకార్లు విడుదల చేయబడినారని అంచా వ్యక్తమైనది. అత్యాచారములు జరిపిన రజాకార్ ప్రముఖ నాయకులనే నిర్బంధంలో ఉంచుట ప్రభుత్వ విధానమని అధికార ప్రతినిధి ఒకరు నేడు చెప్పెను.

### ధాన్యసేకరణ పద్ధతిలో మార్పులు

సంస్థానంలో ధాన్యసేకరణ పద్ధతిలో కొన్ని మార్పులను చేయవలసిందని సూచించుచు, మిలిటరీ గవర్నరుకు సంస్థాన కాంగ్రెస్ తరఫున ఒక నివేదిక సమర్పించబడునని తెలియుచున్నది

సంస్థాన కాంగ్రెస్ అధ్యక్షులు స్వామి రామానందతీర్థగారు మిలిటరీ గవర్నరును యిటీవల దర్శించినప్పుడు, సంస్థానంలో ధాన్యసేకరణ పద్ధతిని చక్కబరచవలసిన అవసరతను గురించి వక్కాణించినట్లు తెలియుచున్నది. ప్రస్తుతమున్న ధాన్యసేకరణ పద్ధతియే కర్షక వర్గములలోని అసంతృప్తికి మూలకారణమనీ, దీనిని కమ్యూనిస్టులు బాగా ఉపయోగించుకొనుచున్నారనీ కాంగ్రెస్ వర్గములు భావించుచున్నవి.

## హైదరాబాద్‌లో ప్లేగు

హైదరాబాద్, నవంబరు 17 హైదరాబాద్‌లో ప్లేగు ప్రారంభమైనప్పటి నుండి అనగా సెప్టెంబరు 7 నుండి యిప్పటి వరకు 381 మందికి వ్యాధి తగిలినదనీ, యిందులో 79 మంది మరణించినారనీ ప్రభుత్వం నేడొక ప్రకటన చేసెను నవంబరు 16 తో అంతమగు వారంలో 76 మందికి ప్లేగు తగిలినది ఇందులో 10 మంది మరణించిరి.



ఢిల్లీలోని కాశ్మీర్ సమాజంవారు గత ఆదివారంనాడు ప్రధానామాత్యుడు నెహ్రూ 60 వ జన్మదినోత్సవం జరిపి కాశ్మీరీ మిఠాయి, పండ్లు సభికులకు పంచిపెట్టిరి. సర్దార్ పటేల్, గోపాలస్వామి అయ్యంగార్, కాశ్మీర్ సమాజ ప్రధానకార్యదర్శి అలిమహ్మద్ తరీక్ గారలు పాల్గొనిరి. ఛలోక్తులు విసురుతూ హాజరైనవారిని ప్రధానామాత్యుడు నెహ్రూ నవ్వించుచున్నాడు.

# సూచౌపై పెద్దఎత్తున దాడికి కమ్యూనిస్టుల విపుల సన్నాహాలు

## రాజధానికి 200 మైళ్లలో చైనా ప్రభుత్వ సేనల విజయం

నాన్‌కింగ్, నవంబరు 17: చైనా రాజధానికి 200 మైళ్లదూరంలో ఉన్న సుచౌవద్ద ప్రభుత్వసేనల భీషణ ప్రతిఘటనకు తాళలేక, వెనుకకు మరలిన కమ్యూనిస్టుసేనలు, నగరముపై పెద్దపెట్టున తిరిగి దాడి సాగించుటకు సమాయత్తమౌతున్నట్లు నేడు తెలియవచ్చినది. సుచౌకు వాయవ్యంగా 3 లక్షల కమ్యూనిస్టుసేన దాడికి సమీకృత మౌతున్నదని, చిన్నచిన్న దాడులనుమాత్రం నేడు ప్రభుత్వ సేనలు తిరుగగొట్టినవని అధికార వార్తలవలన తెలియుచున్నది.

మధ్య చైనాపై చక్రబంధముపన్ని, తూర్పు పడమర దిశలుగా ముట్టడి సాగించిన కమ్యూనిస్టుసేలతో మహాయుద్ధ వారంరోజుల ప్రచండ పోరాటానంతరం ప్రభుత్వసేనలు, తూర్పు దిశగా వచ్చు కమ్యూనిస్టుసేనను ఓడించినవని నిన్న షుచౌను ప్రక్కవాటుగా దాడిలో పురోగమించిన కమ్యూనిస్టుసేన గూడా వెనుకకు మరలినదని, యిప్పుడే ఉభయసేనావాహినులు సుచౌకు వాయవ్యంగా కొత్త దండయాత్రకు పునస్సమాయత్త మవుతున్నవని, అభిజ్ఞులైన పరిశీలకు లనుచున్నారు

నాన్‌కింగ్ ప్రాంతంనుంచి తమ స్త్రీలను, పిల్లలను ఎంపివేయుట మంచిదని, అక్కడి బ్రిటిష్‌ప్రతినిధి బ్రిటిష్ ప్రజలకు సలహా యిచ్చెను అమెరికన్‌అధికారులు గూడా తమ వారి కీవిధమైన సలహాయే యిచ్చిరి

ఇంకా పరిస్థితి కొంత మారేవరకూ చూచిగాని షాంగ్‌హైనుంచి కదలగూడదని బ్రిటిష్ వారు నిశ్చయించుకొన్నారు

టీన్‌ట్సిన్‌నుంచి దాదాపు 450 మంది విదేశ పౌరులు, షాంగ్ హై హాంగ్‌కాంగులకు వెళ్లిరి

## ఇండొనీషియా ప్రతిష్టంభన

### డా॥ హట్టాతో తిరిగి సంభాషణలు జరుగునట

లండను, నవంబరు 17 రిపబ్లికన్ ప్రధాని డా॥ మహమ్మద్ హట్టాతో ప్రత్యక్ష సంభాషణలు జరుపవలసినదిగా ఇండొనీషియాలోని డచ్చి ప్రతినిధుల కాదేశించుటకు డచ్చి మంత్రివర్గము నిశ్చయించినదని తెలియుచున్నది.

డచ్చి మంత్రివర్గ సభ్యులెవ్వరూ ఈసారి ఇండొనీషియాకు వెళ్లరనీ, సంధి ఉల్లంఘనలకు రిపబ్లికనులు మానివేసిన గాని వారితో డచ్చివారు తిరిగి ప్రధాన చర్చలను జరపబోరనీ కూడా తెలియుచున్నది.

వాల్తేరు, నవంబరు 17: డిసెంబరు 11-న ఆంధ్ర విశ్వకళా పరిషత్ స్నాతకోత్సవ సందర్భమున శ్రీ రవీంద్రనాథ టాగూరు కంచువిగ్రహము విశ్వవిద్యాలయ కళాశాలలో ఆర్థికమంత్రి బెజవాడ గోపాలరెడ్డిగారిచే ప్రతిష్ఠింపబడును

## దక్షిణాఫ్రికా పేరాస

### స్వాజీలాండు, బసూటో లాండులపై దృష్టి

కేప్‌టౌన్, నవంబరు 17: ఆఫ్రికాలో బ్రిటిష్ సంరక్షణ క్రిందనున్న స్వాజీలాండు, బసూటో లాండులను దక్షిణాఫ్రికన్ యూనియనులో ఐక్యము చేయుట అత్యవసరమని ద. ఆఫ్రికా ప్రధాని డా॥ మలాన్ నేడు ప్రకటించెను ఈ విషయమై తిరిగి బ్రిటన్‌తో సంప్రదింపులు జరిపెదమని కూడ అతడన్నాడు

# "శక్తి ఉన్నంతవరకు మీ విశ్వాస పాత్రునిగ పని చేయగలను"

## శుభాకాంక్షలకు పండిత నెహ్రూ కృతజ్ఞత

న్యూఢిల్లీ, నవంబరు 17: తన 60 వ జన్మదినోత్సవ (నవంబరు 14) సందర్భంలో శుభాకాంక్షలు పంపినవారందరికీ కృతజ్ఞతను తెలుపుతూ ప్రధాని పండిత నెహ్రూ నేడొక ప్రకటనచేసెను. ఆయన ప్రకటన ఈ క్రిందివిధంగా ఉన్నది.

"అనేకమంది మిత్రులు, సహచరులు నాకు జన్మదినసందర్భంలో శుభాకాంక్షలను తెలుపుతూ సందేశములను పంపిరి. వారిలో నాకు తెలిసినవారు, తెలియనివారు కూడా ఉన్నారు. జన్మదినాలనేవి ఇక నాకు సంతోషదాయకములైనవికావు. వాటి సంగతి జ్ఞాపకం రాకూడదనే నేను వాంఛిస్తాను. అయినప్పటికీ నాపట్ల ఎంతో సద్భావము ప్రేమ కనపరుస్తూ సందేశాలను కురిపించిన వారందరికీ నా కృతజ్ఞతను తెలుపవలసి ఉన్నది. వారు తమ సందేశాలలో వెలిబుచ్చినంత ఉన్నత జీవితాన్ని నడుపుటకు తగిన శక్తి నాదగ్గరలేదు అంత శక్తి నా దగ్గర ఉన్నదనుకునే టంతటి గర్విష్ఠిని కాను. నా పట్ల ప్రదర్శింపబడిన ఇంతటి విశ్వాసానికీ, ప్రేమకూ నేను బాలినవాడిని కాదని భావిస్తున్నాను. నా శరీరంలోనూ, మనస్సులోనూ శక్తి అనేది ఉన్నంతవరకూ వారికి నా పట్ల గల సద్భావం నిలచి ఉండుటకు తగినట్లుగా ప్రవర్తించగలనని ఆశించటం మినహా ఇప్పుడు నేను చేయగలిగినదిలేదు."

### నెహ్రూకు స్టాలిన్ సందేశం

న్యూఢిల్లీ, నవంబరు 17 జవహర్లాలు నెహ్రూ జన్మదిన సందర్భమున మార్షల్ స్టాలిన్ వద్దనుండి న్యూఢిల్లీలోని పండిత జవహర్లాలు నెహ్రూకు నవంబరు 18 తేదీ గలిగిన ఒక తంతి రష్యను భాషలో పంపబడెను. దాని తర్జుమా

"ప్రధాన మంత్రిగారూ, మీ జన్మదినోత్సవమున నా శుభాకాంక్షలు స్వీకరించమని వేడుచున్నాను—జె. స్టాలిన్."

ఇండియా ప్రధాని స్టాలిన్‌కు ఈక్రింది జవాబు పంపెను:

"జనాబె ఆలా, ఆప్కా శుభ్ సందేశ్ ముఝ్‌కోమిలా ఔర్ ఉస్ సే ముఝే ఖుష్‌హుంఈ. ఉస్కేలియే ఆప్కో ధన్యవాద్ దేతాహూం. మైఆప్కో ఔర్ ఆప్కేమహా దేశ్ కేలియే అప్నీ శుభ్‌కామ్నాయే భేజ్ తాహూం." తర్జుమా:

"మీ శుభాకాంక్షలు కృతజ్ఞతతో అందుకొంటిని మీకున్నూ, మీ గొప్ప దేశమునకున్నూ నా శుభాకాంక్షలు పంపుచున్నాను"

## జర్మనీ పునరుద్ధరణ ప్రమాదకరం

### పశ్చిమ రాజ్యాలకు డిగాల్ హెచ్చరిక

పారిస్, నవంబరు 17: ఆంగ్లేయులు, అమెరికన్లు జర్మనీని పునరుద్ధరించవలెనని సంకల్పించుచున్నారని, ఫ్రెంచి పీపుల్స్ ర్యాలీ పార్టీ నాయకుడు జనరల్ డిగాల్ పత్రికా విలేఖరులతో మాట్లాడుతూ చెప్పెను.

రూర్ బొగ్గు, ఉక్కు ఉత్పత్తి కేంద్రములను జర్మన్లకు తిరిగి ఒప్పగింతపెట్టుటకు బ్రిటన్ అమెరికాలు చేసుకొన్న నిర్ణయం, 20 శతాబ్దములోకల్లా మహోపద్రవకరమైన నిర్ణయమని డిగాల్ హెచ్చరించెను.

"జర్మనీని పునరుద్ధరించినట్లయితే అది రష్యాకు ఎదురు నిలువగలదని, అమెరికా బ్రిటన్ల ఉద్దేశ్యమని నాకు తెలుసు. కాని వెనుక రష్యాతో ఒడంబడిక కుదుర్చుకొనుట హిట్లర్‌కు కూడా సులభసాధ్యమైంది" అని డిగాల్ అనెను.

ప్రపంచ రక్షణ విషయమై మాట్లాడుతూ, రక్షణచర్యల విషయంలో మూలకేంద్రము లభించలేదని, [illegible] రక్షణకు [illegible] బ్రిటన్, మధ్య ప్రాచ్యరక్షణకు అమెరికా [illegible] లభించవలెనని డిగాల్ సూచించెను.

చైనా విషయం మాట్లాడుతూ, చాంగ్ కై షేక్ అనేక కష్టములను ధైర్యంతో ఎదుర్కొనుచున్నాడని, ఆయనకు ధన్యవాదము లర్పిస్తున్నానని అటు చైనాను, యిటు యీ ప్రపంచమునకు ఆయన దక్కగలడని ఆశిస్తున్నానని డిగాల్ అనెను.

జర్మనీని పునరుద్ధరించినట్లయితే, జర్మనీ రష్యాలు ఏకం కాగలవని అలాంటప్పుడు జూన్ 18 వ తేదీనాటి వ్యక్తి పూర్తి తమకు లభించునని, ప్రపంచం ఆశపెట్టుకోగూడదని హెచ్చరించెను. జూన్ 18 వ తేదీ నాటి వ్యక్తి అనుటలో, క్రితం యుద్ధంలో, ఫ్రాన్సును మిత్రమండలి వైపు వుంచుటకు తాను చేసిన ప్రయత్నములను డిగాల్ ఉదహరించుచున్నారు.

### నైరృతిఆఫ్రికాపై చర్చల వాయిదా

పారిస్, నవంబరు 17 నైరృతిఆఫ్రికాను ఐ. రా. ధర్మకర్తృత్వమునకు అప్పజెప్పుటకు దక్షిణాఫ్రికా చూపిన తిరస్కారముపై జరుగవలసిన చర్చలను ధర్మకర్తృత్వసంఘము వాయిదా వేసినది. ఈ విషయమై చాలదేశములు వివిధ తీర్మానములను ప్రతిపాదించినవి. వీనిపై రేపు ఓటింగు జరుగును.

ఈ వివిధ తీర్మానముల ప్రతిపాదించిన వారు నేటిరాత్రి సమావేశమై తమతమ తీర్మానాంశముల నన్నిటినీ క్రోడీకరించి ఒకే తీర్మానముగా తయారుచేసి రేపు దానిపై ఓటింగు జరుపుటకు ఆలోచించుచున్నారు

# భారత జాతీయ కాంగ్రెస్‌తో సంస్థానకాంగ్రెస్ అనుబంధం

## హైదరాబాద్ ఇండియాలో చేరువరకు స్వతంత్రంగానే ఉండునని స్వామిజీ ప్రకటన

హైదరాబాద్, నవంబరు 17: "హైదరాబాద్ సంస్థాన భవిష్యత్తునకు సంబంధించిన ప్రతిచిన్న విషయమును గురించి కూడ ఢిల్లీలో నేను సంప్రదింపులు జరిపినాను. రాజ్యాంగ పరిషత్తు విషయమై గూడ సంప్రదింపులు జరిపినాను," అని సంస్థాన కాంగ్రెస్ అధ్యక్షులు స్వామి రామానందతీర్థగారు నేడు యునైటెడ్ ప్రెస్ విలేఖరితో ప్రసంగించుచు చెప్పిరి

స్వామి రామానందతీర్థగారు డా॥ జి. ఎస్. మేల్కోటే, గోవిందదాస్ ష్రాఫ్‌గార్లతో కలిసి నేటి మధ్యాహ్నం ఢిల్లీనుండి వచ్చిరి.

సంస్థాన కాంగ్రెస్‌ను భారత జాతీయ కాంగ్రెస్‌తో అనుబంధంచేయు విషయమై కాంగ్రెస్ అగ్రనాయకుల సంప్రదించినారా అని అడుగగా హైదరాబాద్ ఇంకా ఇండియన్ యూనియన్‌లో చేరలేదుకాబట్టి, యీ ప్రశ్నే ఉదయించదని తీర్థగారు చెప్పిరి ఈవిషయాన్ని గురించి, తదితర విషయాలనుగురించి సంస్థాన రాజ్యాంగపరిషత్తు ఆలోచించునంతవరకు సంస్థానకాంగ్రెస్ వాస్తవానికి భారత జాతీయ కాంగ్రెస్ నాయకత్వాన్ని ఆమోదించినప్పటికీ స్వతంత్రంగానే ఉంటుందని చెప్పిరి.

## కాశింరజ్వీ విచారణ

### సంస్థానంలో జరుపు ఆలోచన

హైదరాబాద్, నవంబరు 17 హైదరాబాద్ మిలిటరీ గవర్నరు మేజర్ జనరల్ చౌధరీగారు పత్రికా ప్రతినిధులతో ప్రసంగించుచు రజాకార్ నాయకుడు కాశింరజ్వీ జాడ గురించి యిప్పటికి వెలువడిన వార్తలన్నీ ఊహా మాత్రము లేనని చెప్పిరి ఒక వార్తాఖండిక యోగ్య విషయమై రజ్వీని విచారించు సందర్భంలో అతనిని సంస్థానమునకు తీసుకొని వచ్చు విషయమును గురించి ప్రభుత్వం ఆలోచించుచున్నదని చౌధరీగారు చెప్పిరి.

# దక్షిణాఫ్రికానుంచి భారతీయులను పంపివేయుటే పరిష్కారమార్గం

## అంతవరకు ప్రభుత్వంవారి యెడ జాతి వివక్షతా విధానాన్ని అనుసరించునని డాంగే ప్రకటన

ప్రిటోరియా, నవంబరు 17 దక్షిణాఫ్రికానుంచి భారతీయులను, తిరిగి పంపించివేయుట తప్ప, దక్షిణాఫ్రికా భారతీయ సమస్యకు శాశ్వత పరిష్కారమార్గ మింకొకటిలేదని, దక్షిణాఫ్రికా ప్రభుత్వ మంత్రి డా॥ డాంగెస్ నేషనలిస్టుపార్టీ కాంగ్రెస్‌లో మాట్లాడుతూ ప్రకటించెను

"అయితే యిది దీర్ఘకాలం పట్టేపని ఎదుటి ప్రభుత్వంతోగూడా ఒడంబడిక కుదురుట అవసరం ఈలోగా, తాము దక్షిణాఫ్రికా వాసులమేనను భావం భారతీయులలో కలుగకుండా చూడవలెను. భారతీయులను తిరిగి వారి పూర్వదేశములకు పంపించివేయుటకు దక్షిణాఫ్రికా అనుసరించే విధానం, పాకిస్థాన్ భారత దేశములకు అంగీకారయోగ్యం కానిమాట వాస్తవం. అయినా దక్షిణాఫ్రికా విధానం, నైతికంగా తప్పైనదిగాని, అసాధారణమైనదిగాని కాదు. ఈ విధానం పాకిస్థాన్ భారతదేశములలోనూ, యూరప్ లోనూ కూడా జరిగినదే.

భారతీయులను తిరిగి పంపించివేసే వరకు ప్రభుత్వం జాతివివక్షతా విధానమును అనుసరించుచునే ఉండును సెగ్రిగేషన్ చట్టం మొదటి భాగం ఆచరణలో యెలాఉన్నదో పరిశీలించుటకు నేను ఒక కమీషన్‌ను నియోగింప దలచితిని. విదేశాలకు పోయేవారికి పాస్‌పోర్టులను యివ్వ నిరాకరించుటలో ప్రభుత్వ ఉద్దేశ్యం తన్ను తాను రక్షించుకొనుటే. అంతేగాని బయటిదేశములకు వెళ్లి ప్రభుత్వమును దూషించేవారికి పాస్ పోర్టు లివ్వడం తగనిపని అని డాంగెస్ అనెను.

డా॥ దాదూనూ, నాయకర్‌నూ, మైకల్ స్కాట్‌ను, దేశంనుంచి పంపించి వేయవలెనని కోరుచూ ప్రతిపాదించిన తీర్మానమునకు సమాధానమొసంగుచూ, ఎవరైనా, దేశమునుండి తరిమివేయతగిన నేరం చేసినట్లైన వారిని ఆవిధంగానే శిక్షించవలెనని డాంగెస్ అనెను

# గంగానదిలో పడవ ప్రమాదంవల్ల 500 మంది మరణం

పాట్నా, నవంబరు 18 సోనేపూర్ సంతనుండి పశువులను, ప్రయాణీకులను ఎక్కించుకొని గంగానదిపై వచ్చుచున్న ఒకపెద్ద పడవ ఇచ్చట ఇంజనీరింగు కళాశాల ఘాటువద్ద తలక్రిందులైనందున కనీసం 500 మంది నదిలో మునిగి మరణించినట్లు తెలియుచున్నది. 100కిపైగా ఆవులు ఎద్దులు, [illegible], సత్రములు సైతము మునిగిపోయినవి ఎంతమంది ప్రయాణీకులు ఈ ప్రమాదములో ప్రాణములనుగోల్పోయిరో వివరములు ఖచ్చితంగా తెలియుటలేదు. ప్రమాదమును కళ్లారా చూచినవారు పైన చెప్పినదానికన్న ఎక్కువగ ప్రాణనష్టము సంభవించినదనుచున్నారు యింతఘోరమైన ప్రమాదము యిదివరకెన్నడూ సంభవించలేదు

# డా॥ పట్టాభిగారి 69 వ జన్మదినోత్సవం

## పెద్ద యెత్తున జరుపుటకు విజయవాడలో సన్నాహం

విజయవాడ, నవంబరు 14: రాష్ట్రపతి డాక్టర్ భోగరాజు పట్టాభి సీతారామయ్యగారి 69 వ జన్మదినోత్సవం యీ నెల 24 వ తేదీనుండి జరుపుటకు శ్రీ మరుపిళ్ళ చిట్టిగారి అధ్యక్షతను ప్రముఖులతో ఒక సంఘము ఏర్పడినది. ఈ సంఘమువారు ఆర్థికసంఘం, పబ్లిసిటీసంఘం, వాలంటీర్ సంఘం అలంకార సంఘములను ఏర్పరచి చురుకుగా పనిచేస్తున్నారు. 24 వ తేదీన ఉత్సవమునకు అధ్యక్షత వహించుటకు రెవిన్యూమంత్రి శ్రీ కళా వెంకటరావు గారిని ఆహ్వానించుచున్నారు.

## డాక్టరుగారి కంచువిగ్రహం ప్రతిష్ఠాపనకు సన్నాహం

డా॥ భోగరాజు పట్టాభి సీతారామయ్య పంతులుగారి యెడల ఆంధ్రప్రజలకు గల అభిమాన భక్తిశ్రద్ధలను వెల్లడించుటకు వారి కంచు విగ్రహమును విజయవాడలో ప్రముఖ ప్రదేశములో స్థాపించుటకు యీ క్రింది కార్యవర్గముతో ఇచ్చట ఒక సంఘము ఏర్పాటయ్యెను:

అధ్యక్షుడు: సర్దార్ మరుపిళ్ళ చిట్టిగారు; ఉపాధ్యక్షులు: మండవ వెంకటరత్నం, నూకల వీరరాఘవయ్య గార్లు; ప్రధాన కార్యదర్శి: దోనేపూడి ఈశ్వర వెంకటేశ్వర్లుగారు, సంయుక్త కార్యదర్శులు: ఏద్దనపూడి రామబ్రహ్మం; ఇవటూరి కోటేశ్వరరావు, బసవరాజు శ్రీరంగశాయిగార్లు; కోశాధికారి: పి. సుబ్బారావుగారు, మంత్రివర్గములోని ఆంధ్రులు, స్థానిక ఎం. ఎల్. ఏలు, పుయ్యూరు కుమారరాజా, గొట్టిపాటి బ్రహ్మయ్య, శివలెంక శంభుప్రసాద్ ప్రభృతులు యీ సంఘములో సభ్యులుగ నుండిరి.

కంచువిగ్రహ ప్రతిష్ఠాపనకు అనువగు ప్రధాన స్థలమును సంపాదించుటకు, మంచి శిల్పిచే విగ్రహమును చేయించుటకు, దాదాపు 30 వేలకుపైగా నిధి వసూలు చేయుటకు కార్యవర్గ సభ్యులు చురుకుగా పనిచేస్తున్నారు. ఆంధ్రప్రజలెల్లరూ యీ ప్రయత్నమునకు పూర్తిగా సహకరించి, విరివిగా విరాళము లిచ్చి, త్వరలో ఫలవంతము చేయవలెనని ప్రధాన కార్యదర్శి విజ్ఞప్తి చేయుచున్నారు.

# డన్‌లప్ గౌరవార్థమై విందు

చెన్నపట్నం, నవంబరు 18: మొన్న చెన్నపట్నం "డన్‌లప్" టైర్లు కంపెనీ మేనేజరు జె. లక్‌హాంగారు, రబ్బరును విస్తృతముగా ఉపయోగములోనికి తెచ్చిన జె. బి. డన్‌లప్ గౌరవార్థము పత్రికా సంపాదకులకు విలేఖరులకు, కన్నెమెరా హోటల్‌లో విందుచేసిరి. నవంబర్ 23 తారీకువాడు డన్‌లప్ కంపెనీయొక్క స్వర్ణోత్సవము.

విందులో శ్రీ ఖాసా సుబ్బారావు ప్రసంగించుచూ, డన్‌లప్‌ను ఒక కంపెనీ యజమానిగా మాత్రమే భావింపరాదనిరి. రబ్బరుకు ఆయన మానవులకు దాసునిగా చేసెను. నాగరికతాభివృద్ధికి రబ్బరుద్వారా డన్‌లప్ చేసిన కృషి చరిత్రాత్మకమైనదనిరి.

శ్రీ పి. యస్. జి. రావు ఈ విందును డన్‌లప్ స్మారకచిహ్నముగా స్వీకరింపవలెనని అతిథులను కోరిరి.

యునైటెడ్ కింగ్‌డం (ఇంగ్లండ్) డిప్యూటీ కమీషనర్ హీల్‌గారుకూడా మాటలాడిన తరువాత లక్‌హాంగారు అతిథులకు వందనము లర్పించిరి.

డన్‌లప్ కంపెనీ చరిత్రను కాలక్రమమును వివరించు పుస్తకము (డన్‌లప్ గెజెట్) ఒకటి అతిథుల కీయబడెను. ఆ పుస్తకములో టైర్లను, ట్యూబులను ఉపయోగించువారికి కావలసిన అనేక సూచనలు చేయబడినవి. కంపెనీ ఉద్యోగులకు చేయబడుచున్న సౌకర్యములు, వారి ఫోటోలుకూడా ప్రకటింపబడినవి. ఇంతేగాక 1887 సంవత్సరములో జాన్‌బాయిడ్ డన్‌లప్, ఇనుప చక్రముల సైకిలు నొకదానిని దీర్ఘముగా పరిశీలించి, రబ్బరు చక్రముల అవశ్యకతను గుర్తించిన విషయముకూడా వివరింపబడినది. అంతే మొదటిసారిగా 1888 లో సైకిలుటైరు ఉపయోగములోనికి వచ్చినది. ఆ నాటినుంచి రబ్బరుకు మానవ సౌకర్యార్థమై వివిధగా ఉపయోగించు ప్రయత్నము లనేకములు విజయవంతముగా కొనసాగుచునే యున్నవి. ఈ పుస్తకములో కలకత్తా పరిసరములలోగల సాహాగంజ్ డన్‌లప్ ఫ్యాక్టరీ వివరములు చేర్చబడినవి.

# విజయవాడలో ఉత్తరాల బట్వాడా సౌకర్యాలు

## గవర్నరుపేటలో వేరే డెలివరీ పోస్టాఫీసు

విజయవాడ, నవంబరు 15: ఇచ్చట గవర్నరుపేట, గాంధీనగరము, ప్రాగ్గానందంపేట, మొగలరాజపురము, క్రీస్తురాజపురము లంకలకు త్వరగా తపాలా బట్వాడా చేయుటకు గవర్నరుపేట అరండేలు వీధియందు ప్రక్కనవున్న గుప్తావారి మేడలో ఇంకొక డెలివరీ పోస్టాఫీసు యేర్పాటు చేయుచున్నారు. ఈ పోస్టాఫీసు డిసెంబరు 1 వ తారీఖునుండి ప్రారంభింపబడునని తెలియుచున్నది. దీనికొరకు విజయవాడ పురజనులు 10 యేండ్లనుండి ఆందోళనచేయుచున్నారు.

### గ్రంథాలయ భవన శంకుస్థాపన

సీతన్నపేటలో నిర్మింపబోవుచున్న కమలా నెహ్రూ గ్రంథాలయ భవనమునకు పురపాలక సంఘాధ్యక్షుడు డా॥ తెన్నేటి చలపతిరావుగారు నిన్న ఉదయము శంకుస్థాపనచేసిరి. ఉత్సవమునందు పురప్రముఖులు చాలామంది పాల్గొనిరి. తరువాత బట్లంకి బుల్లెబ్బాయి అధ్యక్షతను బహిరంగసభ జరిగెను. కాకరపర్తి భావనారాయణచెట్టి, చలపతిరావు ప్రభృతు లుపన్యసించిరి. గ్రంథాలయ వ్యవస్థాపకుడు గొర్రెల రాములుగారి అభినందనములతో సభ ముగిసెను. ఈ భవనమునకు స్థలమును పురపాలకసంఘము ఉచితముగ ఇచ్చెను.

నిన్న సాయంత్రము విజయవాడ వర్తక సంఘమువారు రెండునెలలనుండి ఇచ్చట మకాంచేసియున్న మళయాళస్వాముల వారికి కొత్తపేటలో సన్మానము చేసిరి. సభకు శ్రీ నందిపాటి రామయ్యగారు అధ్యక్షతవహించిరి. తెన్నేటి చలపతిరావు, అలపాటి కుటుంబరావు, అన్నవరపు సుబ్బారావుగుప్త మరికొందరు ప్రముఖులు స్వాములవారు హిందూమతమునకు చేసినసేవ నగ్గడించుచు ప్రసంగములు చేసిరి.

సభానంతరము స్వాములవారికి రు 516/-లు కట్నముగా నిచ్చిరి.

---

తూర్పు కృష్ణాజిల్లా రైతుకాంగ్రెస్ కార్యవర్గము నవంబరు 8-వ తేదీన [illegible] కొనూరి చినవెంకటదాసయ్యగారి. అధ్యక్షతను సమావేశమై, గుడివాడలో ఈ నెల 21-న, కవుతరంలో 24-న, మచిలీపట్నంలో, 28-న, పులిగడ్డలో డిశంబరు 1-న సబ్‌డివిజన్ ఇర్రిగేషన్ సభలు జరుపుటకు తీర్మానించిరి.

నిడదవోలు దివ్యజ్ఞాన సమాజ వార్షిక సభ నవంబరు 9న తాడిమేటి సూర్య కుటుంబశాస్త్రిగారి అధ్యక్షతను జరిగెను. రాబోవు సంవత్సరమునకు డాక్టరు బాబు శ్రీ సత్యనారాయణగార్ని లాడ్జి అధ్యక్షులుగాను, నిడదవోలు శేషగిరి రావుగార్ని కార్యదర్శిగాను ఎన్నుకొనిరి.

ఏలూరులో సుప్రసిద్ధ వ్యాయామ చికిత్సకుడు కమ్ముల అప్పన్నగారు నిర్మించిన కమ్ముల రంగమ్మ మహిళా వ్యాయామ చికిత్సాలయ గృహప్రవేశోత్సవము నవంబరు 12-న తేదీ ఉదయం కనిగొళ్ళ ఆండాళ్ళమ్మగారిచే జరుపబడెను. నూల్వూరు చుక్కమ్మగారు జాతీయపతాకోత్సవము జరిపిరి.

విజయవాడలో యుప్పకాలమంచి పేదల ఉపయోగార్థం పెట్టిన చౌకదుకాణం దరిమిలాను మూసివేసినప్పుడు నిలువ వేలిన రూ 29,000/-లను స్థానిక అన్నదాన సమాజమునకిచ్చుటకు, నిశ్చయింపబడెను.

# భారతదేశ రక్షణలో నౌకాబల ప్రాధాన్యం

## నౌకోద్యోగులకు ఆసఫ్ అలీ హితవు

విశాఖపట్నం, నవంబర్ 16: ఒరిస్సా గవర్నరు ఆసఫ్ అలీ సపరివారంతో నేడిచ్చటికి వచ్చెను. [illegible] జి. ఎన్. శివాసు, పోలీసు సూపరింటెండెంట్ [illegible] బాలకృష్ణ హుసేన్ వాస్టేషను వద్ద వారికి స్వాగతమిచ్చెను. పురపాలక సంఘాధ్యక్షుడు తెన్నేటి విశ్వనాథం, చెన్న రాష్ట్ర శాసనసభా సభ్యులు వి. వీరభద్రరావు, డి. వి. రామస్వామి, జిల్లా జడ్జి మకిఫర్సన్ గార్లు పరిచయము చేయబడిన పిమ్మట, ఆసఫ్ అలీ సింధియా నౌకా నిర్మాణ కేంద్రమును చూడబోయిరి. అచ్చటవారికి జనరల్ మేనేజరు శంకర్ స్వాగతమిచ్చి, కేంద్రము యావత్తు న్నా, రేపు 20 న సర్దార్ పటేల్‌చే జలప్రవేశం చేయబడనున్న 'జలప్రభ' నౌకను చూపెను. అచ్చటినుండి వారు విశాఖపట్నం నౌకాస్థావరమునకేగిరి. స్థావరాధికారి కమాండర్ జి. ఎస్. కర్మార్ స్వాగతమిచ్చెను. 'సర్కార్స్' నౌక ఉద్యోగులు, రేటింగులు గౌరవవందనమాచరించిరి. వారి నుద్దేశించి ఉపన్యసించుచు, వారందరు ఇకపై దేశసేవ ప్రధానముగాఎంచుకొనవలెనని, మనకున్న 4 వేల మైళ్ల కోస్తారక్షణ బాధ్యత నౌకాబలముపైనే ఉన్నదని ఆసఫ్ అలీ అనెను. అచ్చటినుండి వారు 'ఢిల్లీ' నౌకను చూడబోయిరి. ఆనౌకాధికారి రేర్ అడ్మిరల్ జి. టి. యస్. హాల్ వారికి స్వాగతమిచ్చెను. నౌకోద్యోగులు, రేటింగులు గౌరవవందనమాచరించిరి. ఆసఫ్‌అలీ నౌకలో విందారగించిరి. సాయంకాలం వారు ఆంధ్రవిశ్వవిద్యాలయమును సందర్శించిరి.

# రుద్రవరం సైన్యోద్వాసితుల కాలనీ వివరములు

కర్నూలు, నవంబరు 16: సైన్యోద్వాసితుల కేర్పాటగుచున్న రుద్రవరంకాలనీని గత బుధవారం రాష్ట్రసహకారసంఘముల జాయింటురిజిస్ట్రారు రావుబహదూరు కే. సుబ్రహ్మణ్య నాయుడుగారు తనిఖీచేసిరి. పత్రికా విలేఖరులతో ముచ్చటించుచు వారిట్లనిరి: రుద్రవరంలోని 500 ఎకరాల భూమిలో 220 యకరాలు సాగుబడిక్రింద తేబడినవి. 70 మందికి స్థావరయేర్పాటులు చేయబడినవి. ఒక్కొక్కరికి 5 ఎకరాల తరిభూమి, 1½ ఎకరాల మెట్టభూమి యివ్వ తమకును. యిండ్లుకట్టుట రెండునెలలో అగును. ఒక్కొక్కరికి ఒకజత యెడ్లు యిచ్చుటకుకూడ యేర్పాటులు జరుగుచున్నవి. ఈ కాలనీకి గవర్నరు అధ్వర్యమున యేర్పాటు.అయిన సైన్యోద్వాసితుల సహాయనిధినుండి రూ 80,000 లు ఇవ్వబడెను.

ఇదేమాదిరి కాలనీ మరియొకటి రాబోవు జూను నెలలోపల పగిడాల గ్రామముదగ్గర యేర్పాటుచేయనున్నారని, అందువల్ల 400 ఎకరాల తరిభూమి, 300 మెట్టభూమి సాగుబడిక్రింద రాగలదనియు, యిచ్చట 100 గురు సైన్యోద్వాసితులకు స్థావరమిచ్చి ప్రతిఒక్కరికి 4 ఎకరాల తరిభూమి, 4 ఎకరాల మెట్టభూమి యివ్వబడుననికూడ వారు తెలిపిరి.

---

# తిరుపతి దేవస్థానం

## కె. వెంకటస్వామినాయుడుగారు అధ్యక్షులుగ ఎన్నుకొనబడిరి

మదరాసు, నవంబరు 17: తిరుమల తిరుపతి దేవస్థానం పరిపాలక వర్గం సమావేశము నిన్న జరిగినప్పుడు శ్రీ॥ శ్రీ॥ సర్ గోపతి నారాయణస్వామి చెట్టిగారి స్థానే శ్రీ కె. వెంకటస్వామినాయుడుగారు మదరాసు కౌన్సిలు ఉపాధ్యక్షులు ఎన్నుకొనబడిరి.

# మదరాసు రేడియో

## నవంబరు 20 శనివారం

మదరాసు (2)

8 గం. స్వాగతం 7-10 తెలుగులో వార్తలు 7-30 ఎం. జయలక్ష్మిపాట. 8 ఇంగ్లీషులో వార్తలు 8-30 బాలానందం 1 గం. మహిళామండలి అన్వేషణ కథానిక రాచకురువు ప్రసంగం 1-30 ఇంగ్లీషులో వార్తలు 2-5 తెలుగువార్తలు 2-15 [illegible] 4 [illegible] ఇంగ్లీషు 4-30 ఇ. వాయిద్యం 5-30 రామవరపు సుబ్బారావు [illegible] 6 ఇ. వార్తలు 6-30 గ్రామస్థుల కార్యక్రమం వి. బాలత్రిపురసుందరి [illegible] సైనికుల [illegible] లు [illegible]. విశేషాలేమిటి 7-15 తెలుగు వార్తలు 7-30 [illegible] సంయుక్త రాజ్యములో ఐక్యత ఎం. [illegible] ప్రసంగం 7-45 టి. [illegible] 9 ఇ. వార్తలు 9 15 మదరాసు ప్రభుత్వం వారి [illegible] 9-45 [illegible] ఇతర [illegible] కార్యక్రమాలు.



## నోటీసు

ఏలూరు డి॥ మునసబ్ కోర్టులో
O. S. 280 of 1948

వాది: చిట్టూరి యింద్రయ్యగారు.
ప్రతివాది: ఖుర్రా సీతారామసోమయాజులు.

వాదికిని ప్రతివాది 2-9-45 సం॥ రం॥ తేదీని రు 750-0-0 లకు వ్రాయించి యిచ్చిన ప్రామిసరీ నోటును బట్టి యేలూరు డి॥ మునసబ్ కోర్టు O. S. 280 of 48 రు దావా దాఖలు చేసినాడు. సదరు దావా నోటీసు నిమిత్తం 2-12-48 తేదికి వాయిదా అయియున్నది. సదరు తేదీని ప్రతివాది కోర్టుకు హాజరు కానియెడల సదరు దావా ఎక్స్‌పార్టీగా ప్రతివాదిపైన డిక్రీ యివ్వబడు నని ఇందుమూలముగా తెలియచేయడమయినది.

తాడిమేటి ప్రకాశరావు,
10-11-48. వాది వకీలు.

## ప్రకటన

ఏలూరు డి॥ మునసబ్ కోర్టులో
అసలు 287/1948.

వాది. పచ్చిపులుసు వెంకయ్య సా॥ఏలూరు.
ప్రతివాది: కొప్పుల సుబ్రహ్మణ్యం సా॥ ఆశ్వారావుపేట.

ప్రతివాది చెరుకూరి సూర్యరావు గారికిద్ద సైజులు [illegible] రు 1100/ పోలీలు వ్యవసాయమునకు [illegible] ద్రవ్యముకొరకు నిమిత్తం వుపయోగించుకుని నెల 1-కి 100-కి రు 0-8-0 చొప్పున వడ్డీతో అడిగిన తక్షణం యిచ్చేలాగున చ 1-వ ఆజారు 1355 ఫసలీన వ్రాయించి యిచ్చిన ప్రోనోటు 18-8-1948 తేదిని యేలూరు గ్రామంలో వాదికి ట్రాన్సఫరుచేసినందున సదరు ప్రోనోటు బాపతు వడ్డీ సహా రు 1087-1-9 లకు వాది దావా చేసియున్నాడు. యిందుకు ఆక్షేపణలు వున్నయెడల వాయిదా రోజు 27-11-1948 తేదీన కోర్టువారితో మనవిచేసుకోనియెడల మీ పరోక్షమందు తీర్మానించబడును.

సం॥ వెం॥ సుబ్బారావు,
వాది తరఫు వకీలు.

## 'దున్నే వాడికి హక్కు కలగాలి'

### శ్రీ కళా వెంకట్రావుగారి ఉపన్యాసం

చెన్నపట్నం, నవంబరు 17 : దేశంలో ప్రస్తుతపు పంట ఆధిక్యత కావలెనని ఉన్నదనియు పంట అభివృద్ధి కావలెనంటే భూమి దున్నే రైతుకు భూమిలో బలం, లాభం, హక్కు కలుగవలెననియు జమీందారీ రద్దుబిల్లు ఆట్టిదానికి ప్రథమసోపానమనియు మద్రాసు ప్రభుత్వ రెవెన్యూ శాఖామాత్యులు కళా వెంకట్రావుగారు నిన్న సాయంత్రం తాంబరం క్రైస్తవ కళాశాల ఆంధ్ర భాషాభిరంజనీ సంఘములో జమీందారీబిల్లునుగూర్చి మాట్లాడుచూ చెప్పిరి. తెలుగు లెక్చరర్ పి. ఆర్. సి. ఫ్రాన్సిస్‌గారు అధ్యక్షత వహించిరి. సీతారామయ్యగారి జాతీయగీతాలాపనతో సభ ప్రారంభమయ్యెను.

శ్రీ వెంకట్రావుగారు మాట్లాడుచూ ఎకరానికి 20 బస్తాలు పండుచుండగా పట్టాదారుకు 18 బస్తాలు ముట్టచెప్పవలెనంటే రైతుకు భూమిపైకలిగే ఆస్తి ఏమనియు, ఉత్పత్తి పెంచటానికి వానికి ఉత్సాహము ఏమి ఉంటుందనియు అడిగిరి. కూలి, గడి మోపుతప్ప మిగిలేది శూన్యమనిరి. వాడే వాడు 30 బస్తాలు కష్టపడి చెమటోడ్చి పండించినా రేపు పట్టాదారు 20 బస్తాలు గుంజవని హామీఏమి ఉన్నదనిరి. గవర్నమెంటుకు రైతుకు మధ్యమధ్యమనుష్యులను తీసివెయ్యడమే జమీందారీబిల్లు పునాది. 72 లక్షలు ఉన్న ఆదాయాన్ని 230 లక్షలకు పెంచి ప్రభుత్వానికి 48 లక్షలకు మించి జమీందార్లు ఇవ్వడంలేదు. 100 రూ||లు పన్నువస్తూంటే 85 జమీందారు ఉంచుకొని రూ 15 ప్రభుత్వానికి ఇస్తున్నాడు. గవర్నమెంటు మంచిది కావచ్చు చెడ్డదికావచ్చు. ప్రజాహిత కార్యాలకు పనిచెయ్యాలిగదా! ఇప్పుడు ఈ శిస్తుతగ్గింపు శాసనంవల్ల రెండుకోట్లు రైతులకు ప్రభుత్వానికి చెందుతున్నవి. ఇదివరకీరెండుకోట్లూ ప్రజలకు, పరిపాలనకు, రాజ్యాంగానికి గాక ప్రయివేటు వ్యక్తుల అనుభవానికి చెందుతున్నవి. కల్లు ఇజారాదార్లవంటి వారైన జమీందారీ ఇజారాదార్లకు పరిహారం ఎందుకని కొందరు అడుగుతున్నారు. భారతప్రభుత్వ చట్టం 299 సెక్షన్ప్రకారం పరిహారం ఏమీ ఇవ్వనిదే జమీందారీలు రద్దుచెయ్యరాదు. కోటి 28 లక్షల ఎకరాలపైన 12కోట్లు పెద్ద పరిహారమని ఆక్షేపించలేదు. జమీందారీల బిడ్డలందరికీ ఆస్తిలో సమానహక్కు కల్పించాము. అక్రమంగా రైతు శిస్తుకట్టలేకపోతే జమీందారు కానేసిన భూములు క్రయాలు చెల్లవన్నాము. ఇక ఈనాందార్లుగూడా ఒకరకంగా జమీందార్లవంటివారే. మేల్వారం హక్కుఉండి పన్ను వసూలుచేసేవారిని రద్దుచెయ్య దలచుకున్నాము. ఈనాందార్లకు కిలో అర ఎకరంకంటె సగటునలేదు. అయితే వీరి సందర్భం కొంతచేశాము. ఇంకా పూర్తి చేస్తాము. 'వెంకట్రావు కమ్యూనిస్టు' ఆస్తులు లాగివేస్తున్నాడు. అని కొందరు విమర్శించారు. అల్లాంటి విమర్శకులపై ప్రజలే మీదపడుచున్నారు. ఆరు కోట్లే పరిహారమివ్వరాదా అని కొందరు. 12 కోట్లు ఇస్తూంటే ఇప్పుడు ఒక 4 కోట్లు వెంకట్రావు జేబులో పడడంలేదు. ఈవ్యవహారం నూది మొనమీద పార్వతి తపస్సుచేసినట్లు మనంచేసే శాసనం విస్తృతి యెంతమేరం పడుతుంది, పురోభివృద్ధికి తోడ్పడుతుందా అనే సిద్ధాంతాన్ని బట్టే చూడాలి.

'ఒక పాదం పైన పెట్టి ఒక పాదం క్రిందపెడితే లాభంలేదు. దేశంలో ఉంటే 2, 3 విధానాలను ఒక రైత్వారీ విధానానికి తేవడం ముందు కర్తవ్యం. రైత్వారీ విధానం గొప్పదని కాదు. దాన్ని సంస్కరించాలి. 10 వేల ఎకరాలు రైత్వారీ భూమి ఉన్న తంజావూరు మిరాసిదారు ఒకడున్నాడు. ఉన్న భూమిని 5 కోట్ల మందీ పంచుకుంటే సెంటు సెంటు వస్తుంది. లాభదాయకమైన భూమికనీసం ఇంత అని నిర్ణయించాలి. ఇంతకు తగ్గి పంచుకోరాదని శాసించాలి. ఒక యకరం ఉన్న ఆసామీకి 1500 ఎకరాలు ఉన్న ఆసామీకి పన్ను విధానం ఒక విధంగానే ఉన్నది. భూమిపరిమితి, ఉత్పత్తి, ఆదాయాన్ని బట్టి పన్నువిధానం మార్చుకోవాలి. పంటలోభాగం నిర్ణయించి సమగ్రమైన సంస్కరణ తీసుకురావాలి. గున్నకొని వ్యాపారి వ్యవసాయం చేసుకు నేవాడికనీస వేతనం నిర్ణయించాలి. అదే గ్రామ సౌభాగ్యానికి పునాది.

8 కోట్లమంది భోజనంపెట్టే రాజ్యాన్ని రామరాజ్యమని అనలేము. మన కిప్పుడు స్వరాజ్యంవచ్చినది. పరిస్థితులు మారకపోతే పార్లమెంట్‌బార్డిలో [illegible] బార్లి [illegible] పంతికం పెట్టినా [illegible] వెంకట్రావై సంతకాలు పెట్టినా [illegible]. ఈ యంత్రంవల్ల వ్యవసాయానికితోడు వికేంద్రీకృత పరిశ్రమలు మనకు కావాలని తేలింది. 100 కి 78 మంది వ్యవసాయదారులైన వారి స్థితి బాగు చెయ్యాలి. ఆహారోత్పత్తి

## రాజ్యాంగ పరిషత్తు:

# రాష్ట్ర, సంస్థాన సరిహద్దుల మార్పు విధానం

## ప్రొఫెసర్ కె. టి. షా సవరణకు పరిషత్తు తిరస్కృతి

న్యూఢిల్లీ, నవంబరు 17: భారత రాజ్యాంగపరిషత్తులో నేడు నూతన రాజ్యాంగంలోని మూడవ అంశంపై నిశితమైన చర్చ జరిగినది. ఈ అంశం భారతదేశంలోని రాష్ట్రముల, సంస్థానాల సరిహద్దులలో చేయబడు (ఒకదానిని చీల్చి, మరొకదానికి కలపటం, కొన్నిటినుండి భాగాలను చీల్చి కొత్తదానిని సృష్టించటం వెం||) మార్పులకు సంబంధించి ఉన్నది. ఇటువంటి మార్పు లేమైనా ప్రతిపాదించ వలసివస్తే దానిని ప్రతిపాదించే అధికారం కేంద్ర ప్రభుత్వానికి మాత్రమే ఉండునని ఈ అంశం నిర్ణయిస్తున్నది. ఈ నిర్ణయము చాల కఠినముగా నున్నదనీ, దీనివలన ఆ సరిహద్దులు మార్చవలసిన ప్రాంతాల ప్రజల ఇష్టానిష్టములు పరిగణించక పోవటం జరగగలదనీ అన్న కారణాలతో ప్రొ|| కె. టి. షా, డా|| అంబేద్కర్‌గార్లు 2 సవరణలను ప్రతిపాదించిరి. పరిహద్దులు మార్చవలసిఉంటే, ఆ రాష్ట్రి (లేక) సంస్థాన శాసనసభ ఆమోదాన్ని పొందిన మీదటనే భారత ప్రభుత్వం మార్పు విషయమును కేంద్ర శాసనసభలో ప్రతిపాదించవలెననీ, అప్పుడు మాత్రమే ప్రాంతీయ ప్రజల అభీష్టము పాటింపబడి, ప్రజాస్వామిక సూత్రాలకు విరుద్ధంగా ఒక కేంద్రవ్యవస్థ చిత్తం వచ్చినట్లు మార్పులు చేయటం జరిగే అవకాశం లేకుండా పోతుందనీ, షాగారు తమ సవరణలో సూచించిరి.

డా|| అంబేద్కర్‌గారి సవరణలో మూడు మార్పులు ప్రతిపాదించబడినవి. (1) రాష్ట్రి, సంస్థానాల మార్పులను ప్రతిపాదించే అధికారం భారత ప్రభుత్వం నుండి తొలగించి, రిపబ్లిక్ అధ్యక్షునికివ్వవలెను. (2) అధ్యక్షుడు ప్రాంతీయ శాసనసభలతో సంప్రదిస్తే చాలును. ఆ సభల ఆమోదం అవసరం కాకూడదు. (3) సంస్థానాలకు (సామంత పదవీపత్రాన్ననుసరించి) ఆంతరంగిక స్వాతంత్ర్యం ఉన్నది. అందువలన వాటి పరిహద్దులను మార్చేటప్పుడు, రాష్ట్రముల వలెగాక, ఆ సంస్థానముల శాసనసభల ఆమోదమును పొందవలెను. ఈ ప్రతిపాదనలపై చర్చ జరుగుతున్నది. (స్వతంత్రంగా ఉన్న ప్రాంతాలు భారతదేశంలో చేరే విషయమైజరిగిన చర్చా వివరాలు నిన్న ప్రకటింపబడినవి.)

### చర్చ

రాష్ట్రములకూ, సంస్థానములకూ గల తేడాను తొలగించి గ్రామ పంచాయతీల పద్ధతిపై వ్యవస్థ నేర్పరచవలెనన్న అంశం ప్రొ|| షాగారి సవరణ వీగిపోయిన తరువాత నజీరుద్దీన్ అహ్మద్‌గారు ముసాయిదా 2వ అంశంలో కొన్నివిషయాలు తిరిగీ అనవసరంగా చెప్పబడినవనీ, పునరుక్తిలోపం లేకుండా ఉండుటకై వాటిని తొలగించవలెననీ సవరణను ప్రతిపాదించగా అది వీగిపోయెను.

అనంతరం ముసాయిదా మూడవ అంశంపై తీవ్రమైన చర్చ ప్రారంభమైనది.

ఆ అంశం రాష్ట్రముల, సంస్థానముల సరిహద్దులను మార్పుచేసే అధికారమును నిర్వచిస్తున్నది. దానిప్రకారం ఆ మార్పులను కేంద్ర శాసనసభలో ప్రతిపాదించే అధికారం భారత ప్రభుత్వానికి మాత్రమే ఇవ్వబడినది. ప్రొ|| షాగారు మార్పును మొదట ప్రతిపాదించవలసినది. రాష్ట్రి (లేక) సంస్థాన శాసనసభలనీ, ఆ విధంగా ముసాయిదాలో పవరించవలెనని ప్రతిపాదించెను. ఆయన తన సవరణ నీ క్రింది విధముగా సమర్థించెను :

"భారతదేశంలోని రాష్ట్రాలు, ఇతర భాగాలు సమానమైనవి కావు. సక్రమ పరిపాలన సౌకర్యాలకు తగినట్లుగా కూడా అవి లేవు. అందువలన వాటి వైశాల్యములను మార్చి పేర్లనుకూడా మార్చవలసిన అవసరం ఉన్నది. అయితే అటువంటి మార్పులను ఆ ప్రాంతంలో 'జనవాక్య నిర్ధారణ' (రెఫరెండం) జరిపి దాని ననుసరించి చేయటం అత్యుత్తమమైన పద్ధతి. జనవాక్యనిర్ధారణ జరపటం సాధ్య పడకపోతే కనీసం ప్రాంతీయ ప్రజా ప్రతినిధి సభలతో సంప్రదించి అయినా చేయవలెను కాని కేంద్రం నిరంకుశంగా తన ఉద్దేశ్యాలను అనులు జరపకూడదు. ఏ విధంగా విభజన కావలసినదీ ప్రాంతీయ ప్రజలే నిర్ణయించవలసిఉన్నది. ప్రస్తుతపు అంశంప్రకారం, ఆ ప్రాంత ప్రాతినిధ్యం వహించిన కేంద్ర శాసనసభ్యులు ప్రతిపాదించటమో, లేక రిపబ్లిక్ అధ్యక్షుని వద్దకు వేరే రాయబారం రావటమో జరగవలెనని ఉన్నది. ఇది కేంద్ర ప్రభుత్వాధికారాన్ని సూచిస్తున్నదే కాని ప్రజాధికారాన్ని కాదు. పరిహద్దులు మార్చే విషయం ప్రాంతీయ ప్రజాభీష్టాన్ననుసరించి ఉండవలెను. కేంద్ర ప్రభుత్వపు ఉద్దేశ్యాలను వారిమీద రుద్దకూడదు."

### అంబేద్కర్ సవరణ

అనంతరం ఉపాధ్యక్షుని సమ్మతిమీద డా|| అంబేద్కర్ ఈ క్రింది సవరణను ప్రతిపాదించెను : "ఈ మార్పులను ప్రతిపాదించే అధికారం భారత ప్రభుత్వానికే ఉండవలెనన్నది చాల కఠినంగా ఉన్నది. అందువలన ఈ అంశంలో ఈ క్రింది మార్పులను చేయవలెను. (1) సరిహద్దు మార్పులకు సంబంధించిన ఏ ప్రతిపాదన నయినా రిపబ్లిక్ అధ్యక్షుని సిఫార్సులేనిదే కేంద్ర శాసనసభలో ప్రవేశపెట్టుటకు వీలు లేదు.

2. ఆ ప్రతిపాదనలోని నూతన పరిహద్దుల వివరములనుగురించీ, మార్పులు చేయుటనుగురించి ఆరాష్ట్రి (లేక) సంస్థాన శాసనసభను రిపబ్లిక్ అధ్యక్షుడు సంప్రదించిన తరువాతనే ప్రతిపాదన జరుగవలెను. ఈ సవరణ మొదటి షెడ్యూలు ఒకటవ భాగములో ఉదహరించబడిన రాష్ట్రములకు, సంస్థానములకు అన్వయించబడును.

3. మొదటి షెడ్యూలు మూడవ భాగములో ఉదహరింపబడిన సంస్థానముల విషయములో సరిహద్దులు మార్పు చేయవలెనన్న ఆ సంస్థాన శాసనసభయొక్క అనుమతిని రిపబ్లిక్ అధ్యక్షుడు పొందవలెను.

ఈ సవరణను సమర్థించుచూ డా|| అంబేద్కర్ ఈ క్రింది విధంగా ప్రసంగించెను. "మార్పులను ప్రతిపాదించే అధికారం భారత ప్రభుత్వానికిమటుకే ఉండటం చాల కఠినమైన ఏర్పాటు కనుక రిపబ్లిక్ అధ్యక్షునికి కొన్ని నియమముల ననుసరించి ఆ అధికారమును ఇవ్వటం ఉచితమైనపని. రాష్ట్రములను మార్పుజేయునప్పుడు అధ్యక్షుడు శాసనసభను సంప్రదిస్తే చాలును. అనుమతిపొంద నక్కరలేదు. సంస్థానముల విషయం వేరు. అవి సామంత పదవీ స్వీకార పత్రంపై సంతకంచేసినపుడు వాటి ఆంతరంగిక స్వాతంత్ర్యము, అస్తిత్వము హామీ ఇవ్వబడినవి. కనుక వాటి సరిహద్దుల విషయమై మార్పులు చేయవలసివస్తే ఆ శాసనసభయొక్క అనుమతినే పొందవలసి ఉన్నది."

### కుంజ్రూగారి విమర్శ

సంస్థానముల సరిహద్దులను మార్చునప్పుడు ఆ శాసనసభ అనుమతిపొందవలెను కాని రాష్ట్రముల మొదటి షెడ్యూలు 2వ భాగములో చెప్పబడిన సంస్థానముల సరిహద్దులు మార్చునపుడు శాసనసభను సంప్రదించటమే చాలునని అంబేద్కరుగారు చేసిన సవరణను పండిత హృదయనాథ కుంజ్రూ విమర్శిస్తూ, రాష్ట్రములకూ, సంస్థానములకూ [illegible] అని నిర్ణయించవలెనని అంబేద్కరుగారి సవరణలో మరొక సవరణను ప్రతిపాదించెను. ఆయన తన సవరణ నీ క్రిందివిధముగా సమర్థించెను.

"అంబేద్కరుగారు మొదటి షెడ్యూలు 3వ భాగములో చెప్పబడిన సంస్థానాలు స్వతంత్రములని అన్నారు. ఇది చాలా ప్రమాదకరమైన సిద్ధాంతం. ఇది ముసాయిదాలోని అన్ని సూత్రములకూ విరుద్ధముగా ఉన్నది. 226, 227వ అంశములలో రాష్ట్రములకు,సంస్థానములకు భేదములులేవు. కొన్ని సందర్భాలలో కేంద్ర శాసనసభకే సర్వాధికారాలూ ఉండగలవని (రాష్ట్రాలమీద, సంస్థానాలమీద) ఆఅంశాలు చెప్పుతున్నవి. సంస్థాన శాసనసభల అనుమతి అవసరమని అన్నట్లయితే దేశానికి యెంతో అవసరమైన మార్పులను కూడా సంస్థానాలు నిరోధించి, [illegible] చేయగలవు. అందువలన సంస్థాన శాసనసభల అనుమతి తప్పని సరిగా చేయరాదు.

శ్యామానందన్ సహాయ్ గారు మాట్లాడుతూ సంస్థానాలకూ, రాష్ట్రిలకూ భేదాన్ని పాటించకూడదనీ, సంస్థానాల అనుమతి అవసరమైతే రాష్ట్రాల అనుమతి కూడా అవసరం చేయవలెననీ అన్నారు.

పండిత ఠాకూర్దాస్ భార్గవాగారు సరిహద్దుల మార్పులు ఆ ప్రాంతాల్లో జనవాక్యనిర్ధారణ జరిపి దాని ప్రకారమే చేయవలెనన్నారు. రోహిణీకుమార్ చౌదరీగారు అంబేద్కర్‌గారి సవరణనే బలపరచిరికాని రాష్ట్రి (లేక) సంస్థాన అనుమతిలేనిదే కేంద్ర శాసనసభలో మార్పులను చర్చించరాదన్న షాగారి అభిప్రాయాన్నే ఆమోదించిరి. అయితే షాగారి సవరణవలన శాసనసభ్యులుతప్ప మరెవ్వరూ దానిని ప్రతిపాదించే వీలు లేదు కనుక అనేక పెద్ద లోపమని అనిరి. అంబేద్కర్‌గారి సవరణను విమర్శిస్తూ సంస్థానాల అనుమతిని తీసుకోవాలన్నది ప్రమాదకర సిద్ధాంతమనీ, పూర్తి ముసాయిదా 226, 230 అంశాలు, సంస్థానశాసన సభల నిర్ణయాలకు మూడింట రెండువంతుల సంఖ్యాబలం రావలెనుకాని ఒక వోటు ఎక్కువవచ్చినా సంఖ్యాబలం ఉన్నట్లు పాటించబడే పద్ధతిలేదని నిర్ణయించినది కనుక అది కొంత నయమని ఆయన అనెను.

గ్వాలియర్ ప్రతినిధి గోపీకృష్ణ విజయవర్గీయగారు. మాట్లాడుతూ సంస్థాన ప్రజలు రాష్ట్రిప్రజలకన్నా భిన్నంగా ఉండవలెనని కోరటంలేదని అన్నారు. సంస్థానాలలో అధికారం సంస్థానాధీశ్వరులకు ఉన్నప్పుడు, సంస్థానాల 'స్వాతంత్ర్యం' విషయంలో అంత శ్రద్ధ ఎందుకు ఉండవలెను అని ఆయన ప్రశ్నించెను.

### సంతానం విమర్శ

కె. సంతానంగారు ప్రొ|| షా సవరణను విమర్శిస్తూ, ఆ సవరణను అనుసరిస్తే రాష్ట్రములు విభజన కావలెనని కోరే అల్పసంఖ్యాకుల నిర్ణయం ఎన్నటికీ ఆమోదింపబడు అవకాశం ఉండదని అన్నారు. చెన్నరాష్ట్రంలోని ఆంధ్రుల విషయాన్ని ఉదహరిస్తూ, చెన్నరాష్ట్రి శాసనసభలో రాష్ట్రివిభజన తీర్మానాన్ని నెగ్గించలేకపోతే, అల్పసంఖ్యాకులైన ఆంధ్రులు ప్రత్యేకరాష్ట్రిపు ఆశలను వదులుకోవలసినదేనా అని ఆయన ప్రశ్నించెను.

ఆర్. కె. సిధ్వాగారు సంతానంగారి వాదాన్ని ప్రతిఘటిస్తూ రాష్ట్రింలో అధిక సంఖ్యాకులు విభజన కోరకపోతే రాష్ట్రాన్ని విభజించకూడదన్నారు,ఆయన అంబేద్కర్ సవరణను బలపరచెను.

షిబన్లాల్ శాక్సేనాగారు ఈ విధంగా మాట్లాడిరి. "మూలంలోని అంశం ప్రకారం భారతప్రభుత్వం మాత్రమే మార్పులు చేసే ప్రతిపాదన తీసుకురాగలదు.ప్రస్తుత సవరణలతో ప్రతివారికి సరిహద్దులను మార్పు చేయుమని ప్రతిపాదించే అవకాశం కలుగుతున్నది. అది చాలా ప్రమాదకరం. అందువలన రిపబ్లిక్ అధ్యక్షుడు కేంద్రమంత్రివర్గంతో ఆ విషయమై ముందుగా ఆలోచించి మరీ ప్రతిపాదనను అనుమతించటం అవసరం."

కృష్ణస్వామి భారతిగారు సంస్థానములకుగల 'స్వాతంత్ర్యాన్ని' గురించి అంబేద్కర్‌గారు చేసిన సవరణ ప్రమాదకరమైనదని విమర్శించిరి. మత్స్యయూనియన్ ప్రతినిధి రాజ్ బహదూర్‌గారు మాట్లాడుతూ, సంస్థానాల ప్రజలను రాష్ట్రిప్రజలకన్నా భిన్నంగా చూడటం వారిని చిన్నపుచ్చినట్లు భావిస్తారనీ, భారతదేశంలో ఏ మూలనయినా తనఇష్టం వచ్చినట్లుచేసే అధికారం రాజ్యాంగ పరిషత్తుకు ఉన్నదనీ, ఆ అధికారాన్ని బలపరచటానికి సంస్థాన ప్రజలు వెనకాడరని అన్నారు. ప్రస్తుతం అంబేద్కర్‌గారి సవరణను వాయిదా వేయటం మంచిదని అన్నారు.

చర్చ నేటికి ముగియనందున రేపటికి వాయిదాపడినది.

---

కన్న జనాభా వృత్తి అధికంగా వున్నది (నవ్వు) కొన్నిదశలవరకు వ్యవసాయ ప్రాధాన్యం తగ్గదు. 840 పౌన్లు ఎకరానికి ఇండియాలో పండుతూంటే జపానులో 2,970 పౌన్లు పండుతోంది. ఆ విధంగా మనము పండించవచ్చు. మన పంట 100 కి 10 వంతులు జలాశయాలపైన 90 వంతులు వానపైన ఆధారపడి వున్నది. రూ 500కోట్లు పెడితే మన ప్రాజెక్టులన్నీ వస్తాయి. ఉత్పత్తి పెరగటానికి రైతుకు భూమిపై ఉత్సాహం, హక్కు, కలగాలి. అచిరకాలంలోనే సమగ్ర రైతు శాసనం రావాలి. ఉంటే నేను చేస్తాను. లేకపోతే నా తర్వాతి వచ్చే ఆయన చేస్తాడు. ఏ 'ఇజా'లు ఎందరు చెప్పినా గాంధీ తత్వమే మనలను దరిచేర్చగలదు. ఈ రాజ్యం, ఈ దేశం, మన దనీ, ఇది సౌభాగ్యవంతమై విలసిల్లవలెనని ప్రతివారు భావించాలి. భారతదేశ సౌభాగ్యశ్రీ వశ వదిలించి ఉన్నతికి, పునర్నిర్మాణానికి కృషి చెయ్యాలి. ఇందుకు నూత్నదృక్పథం, నూతన విధానం, నూత్నఉత్సాహం అవసరం. ఇందులో విద్యార్థుల భాగం అపారంగా వున్నదని, వెంకట్రావుగారు చెప్పిరి.

ఎం. ఎస్. మూర్తిగారి అభివందనలతో సభ ముగిసెను.

---

చెన్నపట్నం ది ఇండియన్ స్టైన్ ఆర్ట్స్ సొసైటీవారు నవంబరు 21వ తేది సాయంకాలం 5-45 కి విక్టోరియా పబ్లిక్ హాలులో 'అనార్కలీ' తెలుగునాటకమును ప్రదర్శించుచున్నారు.

## దేశ పారిశ్రామికోత్పత్తి పెరుగుదల

### 1948 సం|| ఉత్పత్తి వివరాలు

న్యూఢిల్లీ, నవంబరు18: ద్రవ్యోల్బణము నివారించుటలో అతి ముఖ్యమైనదను పారిశ్రామికోత్పత్తిలో పెరుగుదల కనిపించుచున్నది. వస్త్రాలు, జనుము, ఉక్కు, పంచదార మొదలైన ప్రధాన పరిశ్రమలలో 1948 సం||లో జరిగిన ఉత్పత్తి వివరాలు తెలియవచ్చినవి. అవి ఈ క్రిందివిధంగా ఉన్నవి.

వస్త్ర పరిశ్రమలో ఉత్పత్తి క్రమంగా పెరుగుదలను చూపుచున్నది. 1948 సెప్టెంబర్‌లో అంతమైన సంవత్సర పాదంలో 115,20,00,000 గజాలు ఉత్పత్తి అయినది. ఒక్క బొంబాయినగరంలోని మిల్లులే అక్టోబర్ నెలలో 1947 అక్టోబర్‌లో కన్నా 100 కి 16 వంతులు పత్తిని ఉపయోగించినవి. దేశంలో మిల్లులన్నీ కలిసి ఈ ఏడాదికి అంచనా వేయబడిన 450 కోట్ల గజాలనష్ట ఉత్పత్తిని పూర్తి చేయగలవు.

### జనుము, పొగాకు

1948 సెప్టెంబర్‌లో దేశంలోని జనపమిల్లులన్నీ కలిసి 9 వేల టన్నుల తయారీ సరుకును ఉత్పత్తి చేసినవి. ఇంతకుముందే నెలలోనూ ఇంత ఉత్పత్తి కాలేదు, 1948 మూడవ పాదంలో జనపమిల్లుల మొత్తం ఉత్పత్తి 274,000 టన్నులు. కిందటి పాదంకన్నా 30 వేల టన్నులు ఎక్కువ. జనుము తరువాత ప్రధాన ఎగుమతి అయిన పొగాకు ఉత్పత్తి భారాకంగా ఉంటే సూచన కనిపిస్తున్నది. ఇండియా ఏడాదికి 55 కోట్లపౌన్ల పొగాకును ఉత్పత్తి చేస్తుంది. దీని విలువ 70 కోట్ల రూపాయలు. 1948 సం||పు పంచదార ఉత్పత్తి 10,80,000 టన్నులు ఉండగలదు. ఇది కిందటి ఏడాదికన్నా 2 లక్షల టన్నులు ఎక్కువ.

### ఉక్కు, బొగ్గు

బెంగాల్ ఉక్కు కంపెనీలోని ఉక్కు రేకు యంత్రం ఈ సం|| మధ్యలో చెడిపోవటంవల్ల భారీ పరిశ్రమ ఉత్పత్తి పడిపోయినది. కాని ఇప్పుడు మామూలుగానే పని చేస్తున్నది. జంషెడ్పూర్ టాటా కంపెనీ యంత్రం అక్టోబర్ నెలలో 60 వేల టన్నులను ఉత్పత్తి చేసినది. ఈ సం|| పాదంలో మొదట అనుకున్నట్లు 2,50,000 టన్నులు ఉత్పత్తి కావచ్చును.

గడచిన 6 నెలలలోనూ బొగ్గు ఉత్పత్తి చాలా పడిపోయినది కాని ఇప్పుడు కోలుకుంటున్నది. ఈ సం|| మూడవపాదంలో 67,10,000 టన్నులు ఉత్పత్తి అయినది. ఈ సం|| చివరి పాదంలో 75,00,000 టన్నులు ఉత్పత్తి కాగల సూచనలు కనిపిస్తున్నవి.

## మదరాసు ధరలు

మదరాసు, నవంబరు 18 :

వేరుసెనగ : (5½ శా 1-కి ఎక్కువ కోష్టాగిడ్డంగులు) మెషీన్(సేల్సుటాక్సుతో సహా) బజారు(పాతది) రు. 150-0-0
ఆఫీసువద్ద రు.
వేరుసెనగనూనె: ఎక్సుపెల్లర్ (టాల్‌కోల్) (సేల్సుటాక్సుతోసహా) రు. 812-0-0 (గ్యారంటీ)

ఆముదం బజారుడెలివరీ ఎక్స్‌పెల్లర్ వర్ ఇంగ్లీషుకాండి 500 పౌనులు గంది రు. 350, 355

కొంకాయునూనె (39 పౌను గల డబ్బా) రు. 38-0-0

బంగారు-వెండి నేటి మధ్యాహ్నం 1 గంటకు సవరను 1-కి ఎక్స్ఛేంజ్ బొమ్మ సేల్సుటాక్సుతో సహా రు 76-2-0 పెట్లా బంగారు తులం 114-0-0 మూసబంగారు 112-0-0. సిమునండి తులం 100-కి (రెడి) 177-0-0 వెండి తులం 1-13-0.

### పంచదార

"కాన్పూరు"(2 అందరు) రు. 105-8-0 107-0-0
బూరా (25 పౌన్లు) రు. 11-4-0
కలకండ (25 పౌన్లు) రు. 19-0-0

## న్యూయార్కు దూది

న్యూయార్కు, నవంబరు 17 :

డిసెంబరు 31.86/31.85 మార్చి 31.82/31.83 మే 31.65/31.65 జూలై 30.74/30.75 అక్టోబర్ 28.73/28.73 డిసెంబరు 28.50/28.50 మార్చి 28.25/నా. మే 28.05

| | |
|---|---|
| మిడ్లింగ్ పోతకు | 32.31 |
| డిసెంబరు (కనిష్ఠధర) | 31.86 |
| (కనిష్ఠధర) | 81.75 |

### డిసెంబరు వాయిదా ధరలు

| | | |
|---|---|---|
| నేటి ప్రారంభం | వల | 31.79 |
| నిన్న | | 81.77 |
| ముగింపు | వల | 31.85 |
| నిన్న | | 81.79 |

# గాంధిహత్యా కేసు

## "డా॥ జెయిను చెప్పినది అంతా అబద్ధం"

## ఆత్మాచరణ్ ప్రశ్నలకు మదన్‌లాల్ జవాబు

లాల్ ఖిల్లా, (ఢిల్లీ) నవంబరు 17 గాంధి హత్యా కేసులో నాల్గవ ముద్దాయి యగు మదన్‌లాలును న్యాయమూర్తి ఆత్మాచరణ్ గారు నేడు యింకను ప్రశ్నలు వేసిరి.

రెండు రోజుల యనంతరము నీవు తిరిగి డా॥ జెయినును చూచితివని, నా సలహాను గూర్చి ఆలోచించితివాయని ఆయన అడుగగా 'నేను మీకు ఋణపడియున్నాను. మిమ్ములను పితృసమానులుగా భావించుచున్నాను. మీ సలహాను వినకపోయిన యెడల నేను చెడిపోదును' అని నీవు చెప్పినట్లును, ఆటు తరువాత మరి రెండుకటి రెండు రోజులకు నీవు తిరిగి డా॥ జెయినును కలిసికొని ఒకటి రెండు రోజులలో ఢిల్లీ వెళ్ళుచున్నానని చెప్పినట్లును సాక్ష్యములో నున్నది. ఇందు విషయమై నీవేమైన చెప్పగోరుచున్నావా? అని న్యాయమూర్తి యడుగగా యిది యంతయు అబద్ధమని మదన్‌లాలు చెప్పుచు యిట్లనెను:

"జనవరి 12 న తాను, ఓంప్రకాశ్, నేను అహమ్మద్ నగరునుండి బొంబాయి వచ్చితిమని జోగీంద్రసింగుచే ప్రాతిన వాఙ్మూలములో పోలీసులకు తెలిపియుండెను. జోగీంద్రసింగ్‌చే ప్రాన కోర్టువారి యెదుట సాక్షిగా పిలువనందు కిడియే కారణము. నా వివాహ సందర్భమున ఢిల్లీ వెళ్ళుచుంటినని డా॥ జెయినుతో నేను చెప్పిన మాట వాస్తవమే."

జనవరి 9 న రాత్రి దాదాపు 8-30 కు తాను, కర్కరు, చోప్రా, ఓంప్రకాశ్ బాడ్గే దుకాణమునకు వెళ్ళినమాట, కర్కరు తక్కిన ముగ్గురిని బాడ్గేకు పరిచయము చేసినమాట, తనవద్దనున్న ప్రేలుడు ద్రవ్యములను మదన్‌లాలుకు చూపవలసినదని కర్కరు బాడ్గే నడుగగా శంకరు వానిని తీసికొని వచ్చి తనకు చూపినమాట, వానిని ముట్టించుట తనకు తెలియునని తాను చెప్పిన మాట వాస్తవము కాదని మదన్‌లాలు చెప్పుచు యిట్లనెను: "ఆనాడు నేనును, వాలంటీరుదళము హైదరాబాదు సరిహద్దు గ్రామమును ఖార్దాలో నుంటిమి. కొంతమంది హైదరాబాదు సంస్థాన కాంగ్రెస్ సభ్యులతో నేను సంభాషించితిని. హైదరాబాదు వైపునుండి యింకా దాడులు జరుగకుండుటకుగాను సరిహద్దున నున్న వాళ్ళ కంకెవలను ధ్వంసము చేయుటమా ఉద్దేశ్యమై యుండెను."

జనవరి 14 న తాను బడ్గేను చూచితినని సంభాషించినమాట వాస్తవము కాదని మదన్‌లాలు చెప్పుచు యిట్లనెను: జనవరి 12 నుండి జనవరి 15 వరకు నేను చెంబూరు శరణాగతి శిబిరములో నుంటిని ఢిల్లీ ముస్లీముల పునరుద్ధరణమునకును పాకిస్తానుకు ఇండియా ప్రభుత్వంవారు, 55 కోట్ల రూపాయలు చెల్లించునట్లు చేయుటకును గాంధిమహాత్ముడు నిరశన వ్రతము బూనునున్నాడని రేడియోపై వింటిని. ఈ వార్త నాకు కోపము కలిగించెను. జనవరి 13 న నేను కొంతమంది శరణాగతులను చూడగా క్రిందటిరోజున కొంతమంది తమవద్దకువచ్చి తాము ఢిల్లీలో మహాత్ముని యెదుట ప్రదర్శనము గావింపదలచినట్లు చెప్పిరని ఆ శరణాగతులు నాతో ననిరి. మహాత్ముని వద్దకు రాయబారముకెళ్ళిన బాగుండునని నేను వారికి సూచించితిని. తరువాత నేను కర్కరును కలిసికొని మహాత్మునివద్దకు రాయబారము తీసికొని పోగోరుచున్నానని ఆతనితో చెప్పగా దాని విషయము ఆలోచింతెదను అని అతడనెను. నా వివాహమునకై ఢిల్లీ రాగోరుచుండెనని, రాయబారముతో తానెట్టి సంబంధము కలుగజేసికొననని జనవరి 15 న కర్కరు చెప్పెను."

జనవరి 15 న బడ్గే, ఆప్టే, గాడ్సే, కర్కరే, శంకరులు దాదగునందలి హిందూ మహాసభా కార్యాలయమునకు వచ్చినమాట, తనపక్క చుట్టటిసికొని బయలుదేరవలసినదని కర్కరు అన్నడిగినమాట, ప్రక్కచుట్టతో తాను ఆప్టే తెచ్చినటాక్సీలో కూర్చుని తక్కినవారితో దీక్షిత్ మహరాజ్ యింటికి వెళ్ళినమాట అబద్ధమని చెప్పుచు మదన్‌లాల్ యిట్లనెను:"

గాడ్సే, ఆప్టే, శంకరులను నేను మొదటిసారి ఫిబ్రవరి 14 ననో, అచాయలనో బొంబాయియందలి క్రొత్త సి. ఐ. డి. కార్యాలయ భవనములో చూచితిని. ఖాన్ సాహెబు ఉమర్‌ఖాను వారిని నాకు చూపెను."

దీక్షిత్ మహరాజు యింటివద్ద ప్రేలుడు ద్రవ్యములుగల సంచిని విప్పినమాట, ఆ ప్రేలుడు ద్రవ్యముల నెట్లు ప్రయోగింపవలెనో దీక్షిత్ మహరాజు, బాడ్గే, తెలియజెప్పినమాట, ఆప్టే ఆ సంచిని కర్కరుకు నప్పజెప్పి మదన్‌లాలుతోసహా ఆ సాయంత్రమే ఢిల్లీకి వెళ్ళవలసినదని ఆతనితో చెప్పినమాట వాస్తవము కాదని మదన్‌లాలు చెప్పెను. 1947 సం॥ నవంబరులో తాను దీక్షిత్ మహరాజును గూర్చి వినీ, పంజాబులో జరిగిన ఘోరముల విషయమై దీక్షిత మహరాజు ప్రశ్నింపగా తాను వానిని ఆయనకు వివరించి చెప్పెనని, శరణాగతులకుగాను దీక్షిత్ మహరాజ్ కొన్ని బట్టల నిచ్చెనని మదన్‌లాలు చెప్పెను. జనవరిలో తాను దీక్షిత్ మహరాజును కలిసికొనలేదనెను. కర్కరు తాను జనవరి 15 న బొంబాయిలో బయలుదేరి జనవరి 17న ఢిల్లీ చేరిరనెను. ఢిల్లీలో తాను హిందూమహాసభ భవనమునకుగాని, బిర్లాభవనమునకుగాని వెళ్ళలేదని, స్టేషను నుండి సరాసరి షరీఫ్ హోటలుకు వెళ్ళనని, అచ్చట తాము జనవరి 17 నుండి 19 వరకు బసచేసిరని, హోటలు రిజిష్టరులో నెక్కింపబడిన విషయములు తన దస్తూరీలోనే యుండెనని మదన్‌లాలు చెప్పెను. జనవరి 19 నుండి 20 నుండి తాను హిందూ మహాసభ భవనములో బస చేయలేదని, తన బంధువుల యింట్లోనుండెనని ఆతడనెను.

### జనవరి 20 వ తేదీ ఉదయము జరిగిన వృత్తాంతము

ప్రశ్న: జనవరి 20 తేదీ ఉదయము దాదాపు 8-30 కు ఆప్టే, కర్కరులు హిందూ మహాసభా భవనములో తిరిగి నిన్ను కలసికొనిరిగదా! ఆ నాడే దాదాపు 11-30 కు, మెరీనాహోటలుకు ముందుగా వెళ్ళవలసినదని ఆప్టే నిన్ను కర్కరును హిందూ మహాసభ భవనములో కోరెనుగదా! అంతట మీరు మెరీనా హోటలులో 40 నంబరు గదికి వెళ్లితిరిగదా! ఆ గదిలో గోపాల్ గాడ్సే రివాల్వరును బాగు చేసెనుగదా! నీవు, ఆప్టే, కర్కరులు ఆ గది స్నానపు కొట్టులో గన్‌కాటన్ స్లాబులకు, తేనో టేటర్లకు, చేతిబాంబులకు ప్రిమయర్లు, ఫ్యూజులు తగిలించితిరిగదా? 'ఇది మన ఆఖరు యత్నము. ఈ యత్నము తప్పక సఫలము కావలెను. అన్ని యేర్పాటులు సరిగా జరుగునట్లు చూడుము' అని గాడ్సే చెప్పెనుగదా!

తరువాత ఆయుధములను మందుగుండును పంచుకొను విషయమై చర్చ జరిగెనుగదా! అనంతరము, వాని పంపకము జరిగెనుగదా! ప్రార్థనా స్థలములో నాకు రామ్‌గాడ్సే, ఆప్టేసంజ్ఞ చేయవలెనని, నీవుగన్‌కాటన్‌స్లాబును ప్రేల్చవలెనని, ఇందువల్ల కలుగు అల్లకల్లోలములో తక్కినవారు మహాత్మునిపై రివాల్వరులు కాల్చవలెనని, చేయిబాంబులు విసరవలెనని ఒప్పందము జరిగెను గదా! బాడ్గే ఫొటోగ్రాఫరు వేషమున చోటురామ్‌గదిలో ప్రవేశించి గవాక్షముగుండా మహాత్మునిపై రివాల్వరు కేల్చవలెనని నప్పందము జరిగెను గదా!

ప్ర: ఇది శుద్ధ అబద్ధము. తన మరణము అంగీకరింపబడునను వాగ్దానము జరిగిన తరువాత మహాత్ముడు తన నిరశనవ్రతము నంతము చేసెనని జనవరి 18 తేదీ మధ్యాహ్నము ఒంటిగంటకు నేను వింటిని. అందుపై నాకు ఆందోళన కలిగెను. అంతట నేను ఉర్దూపార్కుకు వెళ్లి మౌలానా అజద్ ఉపన్యాసము వింటిని. సబ్జీ మండీలో పండిత నెహ్రూ, జయప్రకాశ్ నారాయణ్ గారలు ఉపన్యసింతురన్నారని నేను వింటిని అంచేతకయను నాతో తీసుకొని నేను సబ్జీ మండీకి వెళ్లితిని జయప్రకాశ్ నారాయణ్ ఉపన్యాసమునకు నేను ఆక్షేపణ తెలిపితిని. తరువాత నెహ్రూ ఉపన్యాసము ప్రారంభించెను. ఆ ఉపన్యాసమునకుగూడ నేను ఆక్షేపణ తెలిపితిని. సాధారణ దుస్తులలోనున్న కొందరు పోలీసులు నన్ను మందలించిరి. ఆ సాయంత్రము మహాత్మాగాంధి ప్రార్థన సభకు పోజరగునని నాకు తెలిసెను అంతట నేను శరణాగత శిబిరమునకు వెళ్లితిని. అచ్చట బడ్గేను కలిసికొంటిని. శరణాగతులకు ఆయుధములు, మందుగుండు అమ్మతాను ఢిల్లీ వచ్చెనని అతడు నాతో చెప్పెను. శరణాగతులకు అమ్ముటకై నమూనాకుగాను అతడు నాకు ఒక గన్‌కాటన్‌స్లాబు, ఒక చేతిబాంబు నాకిచ్చెను. ఒకటి రెండు రోజులలో మహాత్ముని యెదుట తాము ప్రదర్శన గావింప జోవుచున్నారని, తాను, తన సహచరులు మరీనాహోటలులో బసచేయుచుండిరని అతడు నాతో చెప్పెను. అంతట నేను నాబసకు వెళ్లితిని. గాంధి మహాత్మునికి కొంత దూరములో గన్‌కాటన్‌స్లాబున్ప్రేల్చి, అరాస్తయు, శరణాగతుల కష్టములు మహాత్మునికి తెలుపుట ఉత్తమమని అంతట నేను తలచితిని.

ప్రశ్న: అంట నీవు, కర్కరు మరీనాహోటలు 40 నంబరు గదినుండి బిర్లా భవనమునకువెళ్లితిరిగదా! నీవద్ద ఒక గన్‌కాటన్‌స్లాబు, ఒక చేతిబాంబు వుండెను గదా! కోర్టులో ప్రదర్శింపబడిన కోటును నీవు ధరించితివిగదా!

ప్ర: ఇది అబద్ధము. బిర్లాభవనమునకు నేను బయలుదేరివెళ్లినమాట వాస్తవమే. కాని సబ్జీమండీనుండి నేను బిర్లాభవనమునకు వెళ్లితిని. జా బా ఇచ్చిన గన్‌కాటన్ స్లాబు, చేతిబాంబు నాయొద్దనుంచుకొంటిని. ఈ ఆయుధము లు ఉపయోగింపదలచినదిగానుండెను. కోర్టులో ప్రదర్శింపబడిన కోటు కర్దాభవనములో నేను జనవరి 20 న అరెస్టయినప్పుడు ధరించియుండిన కోటు కాదు. బిర్లాభవనము వెనుక నేను ఆప్టే, గాడ్సే, శంకర్, బాడ్గేలను కలిసికొనలేదు. ఆప్టే సంజ్ఞచేసినమీదట నేను గన్‌కాటన్ స్లాబును ప్రేల్చలేదు. బాడ్గే యిచ్చిన గన్‌కాటన్ స్లాబునే నేను ప్రేల్చితిని. ప్రేలుడు జరిగిన స్థలమునందే నేను అరెస్టయితిని. ఆ ప్రదేశమును నేనే ఎంచుకొంటిని. ఎందువల్లననగా అది జనసమూహమునకు, గాంధిమహాత్మునికి దూరముగా నుండెను. నా లోపలిజేబులో మందుతో కూడిన చేతిబాంబుండెనని అరెస్టయిన మీదట నేను పోలీసులతో చెప్పితిని. సైనికునివలె కనబడిన ఒకడు చేతిబాంబునుండి ఫ్యూజును తీసివేసెను. నన్ను అరెస్టుచేసిన తరువాత మహాత్ముని వద్దకు నన్ను తీసికొని వెళ్లవలసినదిగా పోలీసులను ప్రార్థించితిని. కాని వారట్లు చేయలేదు. పార్లమెంటు స్ట్రీట్ పోలీసు స్టేషనుకు నన్ను తీసికొనివెళ్లిరి. అచ్చట నన్ను పోలీసులు ప్రశ్నలువేసిరి. కొట్టిరి గూడను. శరణాగత శిబిరములో బసచేయుచున్న బాడ్గే నాకు ప్రేలుడుద్రవ్యముల నిచ్చెనని, బాడ్గే సహచరులు మరీనా హోటలు మొదటి అంతస్తులో మూలనున్న ఒక గదిలో నుండిరని బడ్గే తనతో చెప్పెనని నేను పోలీసులతో చెప్పితిని. ఆ రాత్రి పోలీసులు నన్ను మరినా హోటలుకు తీసుకొని వెళ్లి మూల నున్న ఒక గదిని సోదా చేసిరి. ఆగదిలో ఎవరో బసచేయుచుండిరి. తరువాత పోలీసులు మరియొక మూలనున్న గదిని చూచిరి. అదిఖాళీగా నుండెను మూల గదిలో బసచేయుచున్న సి. పాచికోను వారు ప్రశ్నింపగా ఆగదిలో యిద్దరు బస చేయుచుండిరని, ఆ సాయంత్రమే వారు గది వదలి వెళ్లిరని ఆతడు చెప్పెను. అంతట నన్ను పార్లమెంటరీ స్ట్రీటు పోలీసు స్టేషనుకు తీసికొని వచ్చిరి. మరినాహోటలులో బసచేసిన బడ్గే సహచరుల పేర్లు తెలుపవలసినదని పోలీసులు నన్నడిగిరి. వారి పేర్లు నాకు తెలియదని నేను చెప్పితిని. ఢిల్లీకి బయలుదేరి వెళ్లుటకు పూర్వము నవర్కారు, గాడ్సే, ఆప్టే, శంకర్, బడ్గేలను నేనెరుంగనంటిని. కార్కరు ఒక్కని మాత్రము నేనెరింగియుంటిని."

వివిధ ఐడెంటి ఫికేషను పెరేడ్లలో నిన్ను గుర్తుపట్టినవారిపై నీవు చెప్పదగినదేమైన కలదాయని యడుగగా వారిపై తాను చెప్పదగినదేమియు లేదని, కాని తన్ను, తన సాటి ముద్దాయిలను బహిరంగ ప్రదేశములో ఆనేకులు వచ్చి చూచిపోవు ప్రదేశములోనుంచినారని మదన్‌లాలు చెప్పెను. ... హోటలులో నెక్కింపబడి ... మదన్‌లాలుకు చూపగా ... రీయు, దేవనాగరిలిపి ... నున్న ... తప్ప రిజిష్టరులోనున్న తక్కిన విషయములు తనదస్తూరీలో నుండెనని మదన్‌లాలు చెప్పెను.

ప్రాసిక్యూషన్ సాక్షులునీకు ప్రతికూలముగా నెందుకు సాక్ష్యమిచ్చిరి అని యడుగగా దీక్షిత్ మహరాజు, బాడ్గే, డా॥ జెయిను తమ కెట్టి ఆ పదలేకుండుటకుగాను తనపై సాక్ష్యమిచ్చిరని మదన్‌లాలు చెప్పెను. పోలీసు సాక్షులుతప్ప తక్కిన సాక్షులపై తాను చెప్పదగినదేమియు లేదనెను.

ఇంకా యేమైన చెప్పగోరెదవా? తేక మాచింపగోరెదవా అని కోర్టువారడుగగా మదన్‌లాలిట్లు సమాధానము చెప్పెను: "జనవరి 20 నుండి ఫిబ్రవరి 8 వరకు నన్ను ఢిల్లీ సివిల్ లైన్సు పోలీసు స్టేషనులో నుంచిరి. అచ్చట నేను బందీగానుండిన కాలములో ఇన్‌స్పెక్టర్ బాలకృష్ణన్ పత్రికారూపమునున్న కొంత సాక్ష్యము విషయమై నన్ను ప్రశ్నలు వేయదొడగెను. గాంధిమహాత్ముని హత్యచేయుటకు అమృతసర్, జలంధరుల రాష్ట్రీయ స్వయంసేవక సంఘ సభ్యులతో కుట్రచేసితినని ఆపత్రములో నుండెను. గాంధిమహాత్ముని హత్యజరిగిన తరువాత, సటకుసను పృథ్వీ ... షేర్-ఇ-పంజాబు హోటలు కుజెందిన సర్దార్ అంతారసింగ్ మహాత్మాగాంధిని హత్యచేయుటకు కుట్రపన్నిరని, ఆ కుట్రలో నేనుగూడ నుంటినని ఇన్‌స్పెక్టరు బాలకృష్ణన్ నాతో చెప్పదొడగెను. ఫిబ్రవరి 4 న నేను బాడ్గేను బొంబాయియందలి క్రొత్త సి. ఐ. డి. భవనములో చూచితిని. పోలీసులు నన్ను నానావిధములు హింసించుచుండిరి. ఢిల్లీలో గన్‌కాటన్ స్లాబును చేతిబాంబును నాకిచ్చినది అతడేనని నేను పోలీసులకు చెప్పితిని. అందుపై నావిషయమై తమకంతయు తెలియునని పోలీసులు చెప్పిరి. తరువాత బాడ్గేను పూనాకు తీసుకొనిపోయిరి. సవర్కారు, గాడ్సే, ఆప్టేలను నేనెరింగి యుంటినని, గాంధిమహాత్ముని హత్య చేయు కుట్రలో నేనుగూడ సభ్యుడై యుం..."

# సంస్థాన కాంగ్రెస్ కార్యవర్గ సమావేశం

## రామానందతీర్థ నివేదిక

హైదరాబాద్, నవంబరు 17: సంస్థాన కాంగ్రెస్ కార్యవర్గం, స్వామి రామానందతీర్థ అధ్యక్షతను నేడు సమావేశమయ్యెను. సమావేశమునకు 12 మంది సభ్యులు హాజరైరి.

ఢిల్లీలో తాను భారత ప్రధానమంత్రి జవహర్లాల్ నెహ్రూ ఉపప్రధానిసర్దార్ వల్లభాయ్‌పటేల్, భారతజాతీయ కాంగ్రెస్ అధ్యక్షుడుగా ఎన్నికైన డా॥ పట్టాభి సీతారామయ్య పంతులుగార్లతో జరిపిన సంప్రదింపులనుగురించి తీర్థగారు ఒక నివేదికను సమర్పించిరి.

సమావేశం తిరిగి రేపుకూడ జరుగును.

టినని ఇన్‌స్పెక్టరు ఖాన్ సాహెబు ఉమర్‌ఖాన్ నాతో చెప్పెను. ఆ కుట్రతో నాకు సంబంధమేమియు లేదని నేనంటిని అంతట అతడు కొంత గోమాంసమును తెచ్చి ఈ గోమాంసమును పుచ్చుకొనవలసినది లేదా కుట్రను అంగీకరించవలసినది అని చెప్పెను. అంతట నేను 'నీవేమిచెప్పమన్న అది చెప్పెదను' అని యంటిని. అంతట అతడు నా వాఙ్మూలమును ఒక మేజస్ట్రేటుచే నమోదు చేయించెనని చెప్పెను. ఈ గోమాంసపు ఉదంతమును లాన్సునాయక్ కమల్ చూచియుండెను. ఈ విషయమును నేను నగర్వాలాగారికి తెలియజేసిన యెడల తాను సాక్షిగానుండునని లాన్సునాయక్ కమల్ నాతో చెప్పెను అంతట ఖాన్ సాహెబ్ ఉమర్‌ఖాను లాన్సునాయకును సస్పెండుచేసి వోర్లీ జెయిలుకు పంపెను. నాగర్వాలా ను చూచుటకు నాకు ఖాన్‌సాహెబు ఉమర్‌ఖాన్ అనుమతి యొసగలేదు." ఆ. పె.

# శంకరకిష్టయ్య విచారణ ప్రారంభం

న్యూఢిల్లీ, నవంబరు 18: గాంధి హత్య కేసువిచారణలో నేడు శంకరకిష్టయ్యను పరీక్షించిరి. ఇతడికి తెలుగుభాషమాత్రమే వచ్చినందున కోర్టువారు దుబాషీని ఏర్పాటుచేసిరి. డిఫెన్సుతరఫు న్యాయవాది, ఆ ప్రూవర్ బడ్గేను, జైలుఅధికారులను కోర్టు నుండి వెలుపలికి పంపివేయవలసినదని కోరగా కోర్టువారు అటులచేసిరి. శంకర కిష్టయ్య తనది షోలాపూరు అనీ, ఆప్రూవర్ బడ్గే ఇంట నౌకరుననీ చెప్పెను.

న్యాయమూర్తి: దిగంబర్ బడ్గేయింట 1948 లో నౌకరుగా నియమింపబడినట్లు సాక్ష్యములో చెప్పబడినది నీవని "బాంబర్" కు (కష్టలకు) పిడులు తగిలించు చేయుటయని సాక్ష్యములో వున్నది. బడ్గేకు ఆయుధములు, మందుగుండుసామగ్రి తీసుకొని పోయెడివాడవుటకదా?

కిష్టయ్య: జౌను నేను బడ్గేఇంట బండ్లోకుమా. కష్టాలకు పిడులు తగిలించుచుంటి. బడ్గేకి మందుగుండు సామగ్రి తీసికొని పోయెడివాడిని

# హైదరాబాదు విభజన

## సంస్థాన కాంగ్రెస్ వైఖరి: మహారాష్ట్రుల అసంతృప్తి

హైదరాబాద్, నవంబరు 17: హైదరాబాద్ సంస్థాన కాంగ్రెస్, సంస్థానమును భాషాప్రాంతాలుగా విభజించుటకు అంగీకరించకపోయినపక్షంలో ఒక పోటీ సంఘమును లేవదీసెదమని మహారాష్ట్ర కాంగ్రెస్ వాదులు కొందరు హెచ్చరిక చేసినారు. వీరిలో చాలమంది మరాఠ్వాడాకు చెందినవారు. సంస్థానమును భాషా ప్రాంతాలుగా విభజించు పట్ల సంస్థాన కాంగ్రెస్ సుముఖంగా లేనిచో దానినుండి విడిపోయెదమని వీరు తెలియజేసినారు. సంస్థానమును పక్కనున్న యూనియన్ రాష్ట్రాలలో కలిపివేయుట, నిజాం నవాబును తక్షణమే పదవి నుండి తొలగించుట, మరాఠ్వాడా కాంగ్రెస్ వాదులలోని కొందరి ప్రవర్తననుగురించి విచారించుటకు గాను ఒక విచారణ సంఘమును ఏర్పాటుచేయుట వీరి కోర్కెలలో ముఖ్యమైనవి.

హైదరాబాద్ పోలీసు ఇన్‌స్పెక్టరు జనరల్ ఏ. వి. పాత్రోగారి సహాయార్థం చెన్నపట్నం, బొంబాయిలనుండి యిద్దరు పోలీసు డెప్యూటీ ఇన్‌స్పెక్టరు జనరలులు నియమించబడుచున్నారు. బొంబాయినుండి నియమించబడు డెప్యూటీ ఇన్‌స్పెక్టరు జనరలు పదవికి, గాంధీజీ హత్యాభియోగంలో దర్యాప్తుజరిపిన నగర్వాలా పేరు సూచించబడినది. చెన్నపట్నంనుండి నియమించబడు పోలీసు అధికారి యిక్కడ సి. ఐ. డి. స్పెషల్ శాఖాధికారిగానుండును.

# హైదరాబాద్‌లో మతసఖ్యత

## అమెరికా జర్నలిష్టు ప్రత్యేక పరిశీలన

హైదరాబాద్, నవంబరు 16: సంస్థాన ఉత్తరజిల్లాల పర్యటన సందర్భంలో మిలిటరీ గవర్నరు వెంటఉన్న ఒక అమెరికా జర్నలిస్టు, గవర్నరుపట్ల హిందువులు, ముస్లింలు, సిక్కులు, క్రైస్తవులు చూపిన ఆదరాభిమానములకు ఆశ్చర్యపోయెను.

జిల్లాలోని పరిస్థితులను స్వయంగా తెలుసుకొనుటకుగాను, యీజర్నలిస్టు మిలిటరీ గవర్నరువెంట వెళ్లియుండెను. ప్రస్తుతప్రభుత్వంక్రింద ముస్లింలు ఎటువంటి జీవితం గడుపుచున్నారో తెలుసుకొనుటకు గాను దొరికిన ప్రతి చిన్న అవకాశమును కూడ జారవిడువకుండా యితడు ఉపయోగించుకొని అనేకచోట్ల స్థానిక ముస్లింలతో మాట్లాడి పరిస్థితులను స్వయంగా తెలుసుకొనెను.

మిలిటరీ గవర్నరు వెంటఉన్న పత్రికా ప్రతినిధులనుండి విడిపడి యితడు నాందేడులోని అజంషాహి బట్టలమిల్లునకు అగ్ర రాత్రి వెళ్లెను. ఇతడు దాని మేనేజరైన ముస్లింద్వారా మిల్లులో 4 వేలమంది కార్మికులు అన్ని మతాలవారు ఉన్నారనీ, వారందరు సంపూర్ణంగా సఖ్యతతో నున్నారనీ తెలుసుకొనెను. సంస్థానమంతటా నెలకొనియున్న మతసఖ్యతను చూసి యితడు ఆశ్చర్యపోయెను.

### హైదరాబాదు మజ్లీస్ సంఘ మహాసభ

హైదరాబాదు, నవంబరు 16: డిసెంబరు 11, 12 వ తేదీలలో హైదరాబాదు సంస్థాన మజ్లీస్ సంఘం హైదరాబాదులో సమావేశమగును. మహాసభకు ఒక స్వాగత సంఘం ఏర్పాటుచేయబడెను. స్వాగత సంఘమునకు బి. ఎస్. మహాదేవసింగుగారు అధ్యక్షులుగాను, ఎల్. నారాయణ్ కార్యదర్శిగాను నియమింపబడిరి.

# వ్యవసాయ సంస్కరణ విచారణసంఘం

## మదరాసులో 36 గురు సాక్షులను విచారింతురు

మదరాసు, నవంబరు 17: వ్యవసాయ సంస్కరణ విచారణసంఘం సభ్యులు మదరాసునకు యీనెల 21 తే. వత్తురు. మదరాసు ప్రధాని అందు సభ్యులుగనున్నారు. వీరి సారి యీ విచారణయందు పాల్గొందురు. కమిటీ సంఘం 21 నుండి 25 తేదీ వరకు ప్రతిదినం ఉదయం 8-10, సాయంకాలం 5-7-30 గం. మధ్య సమావేశమయి 36 గురు ఉద్యోగేతర సాక్షులను విచారింతురు. ప్రధాని మదరాసు కౌన్సిలుకి హాజరగుటకు వీలుగా యీ యేర్పాటు చేయబడింది.

కమిటీవారు 27 తే కాలికటుపోయి 29 తే. తిరిగి మదరాసువచ్చి, సివిల్ సప్లయిసు, ఆహార వ్యవసాయ శాఖోద్యోగులను పరీక్షింతురు. 30 తేదీ డిశంబరు 1 తేదీ బెజవాడలో 18 గురు సాక్షులను విచారింతురు. మదరాసు ప్రధాని బెజవాడ విచారణయందు పాల్గొందురు. కమిటీ వారు చేరువ గ్రామాలుకూడ చూతురు.

# రామపాదసాగరం

## కనీసం కోటి రూపాయలైనా ఇప్పించమని మద్రాసు ప్రభుత్వ విజ్ఞప్తి

చెన్నపట్నం, నవంబరు 17: కేంద్ర ప్రభుత్వ ప్రాజెక్టుల 'ప్రయారిటీ' ల కమిటి నేడు ఢిల్లీలో సమావేశమగుచున్నది. రామపాదసాగరం వెంటనే కొంత పని ప్రారంభించుటకు 3 కోట్లయినా నిధి యివ్వవలెనని మద్రాసు ప్రభుత్వము తరఫున ఢిల్లీలో చర్చల సందర్భమున తెలుపబడెనని యీ భారత ప్రభుత్వమువారు కోటి రూపాయలు గూడా ఇచ్చుట గానమని చెప్పినదనియు అందువల్ల కనీసం కోటి రూపాయలైనా ఇప్పించవలెనని మద్రాసు ప్రభుత్వమువారు ఇప్పుడు వ్రాసినటుల తెలియుచున్నది.

శ్రీ రంగరామమూర్తిగారి అధ్యక్ష్యమున కేంద్ర సంఘమునకు రామపాదసాగర ప్రాజెక్టు సత్వరము నిర్మాణముచేయవలసిన ఆవశ్యకతను తెలుపుటకు ఒక రాయబార వర్గము 18 తే సాయంత్రమునకు డిల్లీ వెళ్లుచున్నది.

## కార్మిక ట్రిబ్యునల్ అధికారాలు

### మదరాసు హైకోర్టు తీర్పు

చెన్నపట్నం, నవంబరు 17. కార్మిక తగాదాలను పరిష్కరించే నిమిత్తం నియమింపబడే ట్రిబ్యునల్‌కు యజమానికి పనివారికి మధ్యగల ఉద్యోగ షరతులలో లేని తగాదా విషయాలను విచారణ చేయుటకు కార్మిక తగాదాల చట్ట ప్రకారము అధికారము లేదని ఆక్షేపణ దెలుపుతూ క్రోమ్ ఫాక్టరీ, రాణీపేట చక్కెర ఫాక్టరీల తరఫున హైకోర్టులో దాఖలైన మాండమస్ దరఖాస్తును వనుక న్యా॥ సుబ్బారావుగారు అంగీకరించి పై ఆక్షేపణ సక్రమమైనదిగా తీర్పునొసగియుండిరి ఆతీర్పు సందర్భములో దాఖలైన అపీలును న్యా॥ హార్విక్, న్యా॥ గోవిందమీనన్‌గార్లు విని ప్రభుత్వము నియమించే ట్రిబ్యునల్‌కు పని వారికి యజమానికి యుండే ఒప్పందపు షరతులకు సంబంధించినవే గాకుండా ఏ తగాదా విషయమైనా విచారణ చేసి పరిష్కరించుటకు సర్వాధికారము కలదని యీ దినం తీర్పు నిచ్చిరి.

### బస్సు రేట్ల వృద్ధినిరసనం

మదరాసులో బస్సురేట్లు నిరసించుచు, బస్సు ప్రయాణీకుల సంఘాధ్యక్షులు ఆర్. ఆర్. దళవాయిగారి అధ్యక్షతను మహాసభ హాలులో జరిగిన బహిరంగసభయందు తీర్మానించబడెను. మంత్రిగారు డిల్లీనుండి 17 తేదీ వచ్చేటప్పుడు వారికి విన్నవించుటకు అవకాశమే లేకుండ, శాసనసభ్యులకు ఎస్. ఎస్. వరదాచారిగా రొక్కరితో సంప్రదించుటతో ట్రాన్సుపోర్టు ఉద్యోగులు 15 వ తేదీనుండి రేట్లు పెంచి, అమలు జరుపుట భావ్యంకాదని శ్రీ దళవాయిగారు నుడివిరి.

### విశాఖ సి. టి. ఒ.

విశాఖ కమర్షలుటాక్సు ఆఫీసరుగ బి. సాంబమూర్తిగారు మదరాసునుండి మార్చబడిరి.

## మదరాసు ప్రజాశాంతి రక్షణ చట్టం

చెన్నపట్నం, నవంబరు 17: మదరాసు ప్రజాశాంతి రక్షణ చట్టమును బనగనపల్లికి వర్తింప చేస్తూ మదరాసు ప్రభుత్వం ఉత్తరువు జారీ చేసినది. ఈ చట్టము అక్కడి 1949 మార్చి 11వ తేదీ వరకు అమలులోనుండును. అల్లరులు అణచే అధికారము గల చట్టము కూడా బనగనపల్లి పుదుక్కోటకు వర్తింప చేయబడెను.

## కార్పొరేషను ఎన్నికల ఆక్షేపణదావాల వాయిదా

చెన్నపట్నం, నవంబరు 17 పురుషవాక్కం, ఎగ్మూరు, చేపాకు, తొండయార్పేట, సైదాపేట డివిజనులనుండి కార్పొరేషనుకు ఎన్నిక గాంచిన అభ్యర్థుల ఫలితములను ఆక్షేపిస్తూ దాఖలైన దావాలను స్మాలుకాజుకోర్టు జడ్జి ఈ వాళ విచారణకు తీసుకొని వాటిలో నాలుగింటిని రాబోవు జనవరి మాసమునకు ఒక దానిని శుక్రవారికి వాయిదా వేసిరి

## కమ్యూనిష్టు డిటెన్యూ విడుదలకు ఉత్తరువు

చెన్నపట్నం, నవంబరు 17: మలబారు కమ్యూనిష్టు నాయకుడు ఏ.కే. గోపాలన్‌ను, ప్రజాశాంతిరక్షణ చట్టముక్రింద నిర్బంధించుటకు ప్రభుత్వము తెలియజేసిన కారణములు సత్యముగా లేవని హేబియస్ కార్పస్ పిటీషను సందర్భములో న్యా॥ సుబ్బారావుగారు, న్యా॥ హార్విక్ గారి అభిప్రాయానికి ప్రతికూలముగా ఎల్లించిన అభిప్రాయముతో న్యా॥ సత్యనారాయణరావుగారు ఈవాళ ఏకీభవిస్తూ నిర్బంధితుని వెంటనే విడుదలచేయ ఉత్తరువు చేసిరి.

# జయపూర్ కాంగ్రెసు

## ప్రేక్షకులు గమనించవలసిన విషయములు

రాష్ట్ర రివన్యూమంత్రి శ్రీ కళావెంకట్రావుగారు ఇలా వ్రాస్తున్నారు

ఆంధ్రదేశమునుండి జయపూర్ కాంగ్రెసుకు వెళ్ళదలచినవారు ముఖ్యంగా యీ క్రింది విషయములు గమనించవలయును.

1. రైల్వేవారు రెండు స్పెషలుబండ్లను నడపెదరు. 2. ఈ రైళ్లు ఆగ్రామీదుగ జయపూరు వెళ్ళును. 3. ఆగ్రానుండి చిన్నబండ్లు (స్పెషలు రైళ్ళులు) నడపెదరు. ప్రయాణీకు లచట మారవలెను. 4. బండిలో భోజనము ఫలహార వసతు లుండును. ఎవరి భోజనము ఖర్చులు వారే భరించవలెను. 5. జయపూర్ వెళ్లుటకు మాత్రమే టిక్కట్టు ఇవ్వబడును. తిరిగి వచ్చేటప్పుడుకూడా స్పెషలు రైలు వుండునుగాని, జయపూర్‌లో ఏర్పాట్లు చేసుకొనవలెను. 6. ఈ స్పెషలు బళ్లు మార్గములో ఎచటను ఎక్కువకాలము ఆగవు. 7. మద్రాసునుండి బయలుదేరే బండి నెల్లూరు, ఒంగోలు, చీరాల, బాపట్ల, తెనాలి, బెజవాడలలో టిక్కట్లు రిజర్వుచేసుకున్న వారిని ఎక్కించుకొనుటకు ఆగును. 8 పశ్చిమగోదావరి, తూర్పుగోదావరి, విశాఖపట్నంజిల్లావారు బెజవాడలో బండి ఎక్కవచ్చును. 9. మదరాసునుండి జయపూర్‌కు వెళ్ళుటకు ఛార్జీలు:

| | | |
|---|---|---|
| 3 క్లాసు | రు | 86-5-0 |
| ఇంటరు | రు | 65-5-0 |
| II క్లాసు | రు | 116-4-0 |
| I క్లాసు | రు | 217-12-0 |

(10) స్పెషలుబండిలో 1 వ తరగతి 2 వ తరగతులు దొరుకుట దుర్లభము, (11) (క) జయపూర్‌లో వసతికి రు. 5-0-0, (చ) కాంగ్రెసు చూచుటకు టిక్కట్లు 2 రోజులకు రు. 10-0-0 లేక 25-0-0 లు (ట) సబ్జక్టుకమిటీ మీటింగు చూచుటకు 2 రోజులకు రు. 25/-ఒకరోజుకి రు 15/- (12) భోజనపు ఖర్చులు ఎవరికి వారే భరించవలెను.

అందువలన 3 వ తరగతి టిక్కట్టు గలవారికి:

| | |
|---|---|
| మదరాసునుండి | 86-5-0 |
| జయపూర్‌లో బసకు | 5-0-0 |
| ప్రేక్షక టిక్కట్టు | 10-0-0 |
| సబ్జక్టుకమిటీ టిక్కట్టు | 25-0-0 |
| రు, | 76-5-0 |

వారికి రు. 76-5-0 లు పంపవలయును. తిరుగు రైలు టిక్కట్టు ఎవరికి వారే అచటనే కొనుక్కొనవలయును.

| | |
|---|---|
| మదరాస్‌నుండి ఇంటరు | 65 5-0 |
| బసకు | 5-0-0 |
| ప్రేక్షక టిక్కట్టు | 10-0-0 |
| సబ్జక్టుకమిటీ టిక్కట్టు | 25-0-0 |
| | 105-5-0 |

ఇంటరు కొనదలచుకొనదలచినవారు పంపవలసిన మొత్తం 105-5-0,

| | |
|---|---|
| మద్రాస్‌నుండి II వ క్లాసు | 116-4-0 |
| బసకు | 5-0-0 |
| ప్రేక్షక టిక్కట్టు | 10-0-0 |
| సబ్జక్టుకమిటీ టిక్కట్టు | 25-0-0 |
| | 156-4-0 |

IIవ క్లాసు తరగతి కావలసినవారు పంపవలసిన మొత్తం రు. 156-4-0. (13) సబ్జక్టుకమిటీ ప్రేక్షక టిక్కట్టు రు 25/- లది కావలసివుంటే పెట్టేట్లకు ఎక్కువగా ఇరువది రూపాయలు పంపవలెను. (14) స్పెషలు రైలు బయలుదేరు వేళ, తేదీముందు ప్రకటించబడును.

డబ్బు 25 వ తేదిలోపల పంపనివారికి టిక్కట్లు దొరకవు. ప్రధానంగా కాంగ్రెసు ప్రేక్షకటిక్కట్లు అసలే దొరకవు గాన వెళ్లదలచిన ప్రేక్షకులు వెంటనే పై విధంగా డబ్బును ఈ క్రింది అడ్రసుకు పంపవలెను.

కళా వెంకట్రావు
మద్రాస్ ప్రభుత్వ రెవిన్యూమంత్రి
ఫోర్టు సెంటుజార్జి మద్రాస్.

మరా: జయపూర్‌లో చలిబాధ చాల హెచ్చుగావున్నది గాన ఉన్నిదుస్తులు ప్రతివారు తెచ్చుకొనవలెను ముందుగా ప్రేక్షకులు బసను డిశంబరు 1 లోపల రిజర్వు చేసుకోనియెడల అనేక ఇబ్బందులకు లోనుగావలసియుండును గాన వెంటనే తొందరపడవలసినదిగా కోరుచున్నాము. డబ్బు పంపినవారికి ఎప్పుడు బయలుదేరవలసినదీ వివరములు తెలుపబడును.

### ఆంధ్ర రాష్ట్ర కాంగ్రెసు కార్యదర్శి ప్రకటన

విజయవాడ, నవంబరు 16: జయపూరు కాంగ్రెసుమహాసభకు వెళ్లదలచువారు ప్రయాణపు వివరములను జిల్లా, తాలూకా, పట్టణ కాంగ్రెసు సంఘముల ద్వారా తెలుసుకోవచ్చుననీ, మద్రాసునుంచి బయలుదేరు ప్రత్యేక ట్రెయినులో ప్రయాణించగోరువారు రాష్ట్ర కాంగ్రెసు కార్యాలయానికి నవంబరు మాసాంతంలోగా రూ 100/-అడ్వాన్సుగా పంపవలసిందని రాష్ట్రకాంగ్రెస్ కార్యదర్శి ప్రకటించుచున్నారు.

# ఫిర్కా అభివృద్ధి స్కీము వట్టి దండుగ

## కామరాజనాడరు విమర్శ

మధుర, నవంబరు 15: రాష్ట్రకాంగ్రెసు సంస్థలకు మంత్రులకు యింకను ఎక్కువ సహకార ముండాలని తమిళ నాడు కాంగ్రెస్ అధ్యక్షులు పుల్లాం కుప్పి యందు జరిగిన రామ్నాడు రాజకీయ సభాధ్యక్షోపన్యాసమునందు సూచించిరి. సభకు సుమారు వేయిమంది ప్రతినిధులు ప్రేక్షకులు వచ్చిరి. మంత్రులు భక్తవత్సలం మాధవమీనను కళావెంకట్రావుగార్లు సభలో పాల్గొనిరి.

ప్రభుత్వం వారి ఫిర్కా డెవలపుమెంటు స్కీముల క్రింద ఖర్చించే ద్రవ్యం గ్రామస్తుల కిస్తే, రోడ్డు అభివృద్ధికి, యితర సౌకర్యాలకు బాగుగ వినియోగపడేది. గ్రామస్థులకు రవాణా లేక బాధపడుచున్నారు. ప్రభుత్వము వారు క్రొత్త స్కీము తలపెట్టినపుడు, ముందుగ కాంగ్రెసు వారితో చర్చించి యుండినచో, తరువాత చిక్కులు లేక సాఫీగా అమలు జరుగుటకు వీలుండేది, మంత్రులు తప్పుచేస్తే ఏవిధంగ తప్పు చేస్తున్నారో విమర్శించి చూపవలసిన బాధ్యత ప్రజలకు కాంగ్రెసు వారికి గలదు. మంత్రులు అట్టి విమర్శలను గమనించక పోయినచో ప్రజలకిను కష్టములోనగుదురు" అని నాడరుగారు నుడివిరి. ద్రవిడస్తాను వాదులు కమ్యూనిస్టులు దేశంలో అరాచకం తెచ్చి పెట్టడానికి ప్రయత్నించుచున్నారు. అట్టి శక్తులను అణచి వేయుటకు ప్రజలంతా తోడ్పడాలి. సోషలిజమంటే కాంగ్రెసుకి భయం లేదు. క్రమేణా శాంతంగా దేశం సోషలిస్టు పద్ధతికి మారాలనే అందరు కోరుచున్నారు. స్వేచ్ఛాభిమానించిన సోషలిస్టులేనా. వారి 60 జన్మదినమున మనమూ సభ జరుపుచున్నాము. వారికి దీర్ఘాయుస్సు భగవంతుడు ప్రసాదించుగాక" అని శా. నాడరు గారనిరి. (అ.ప్రె.)

## తమిళనాడు కాంగ్రెసు

### శాసనసభ్యులు కాంగ్రెసు పెద్దలు పెర్మిట్లు పుచ్చుకోరాదనుట

మదరాసు, నవంబరు 17: తమిళనాడు కాంగ్రెసు కార్యవర్గ సమావేశము నిన్న రాజాజీహాలులో కామరాజనాడారుగారి అధ్యక్షతను సమావేశమైనపుడు, కాంగ్రెసు శాసనసభ్యులు, కాంగ్రెస్ సంస్థలందు బాధ్యతలు కలవారు లైసెన్సులు పెర్మిట్లు గల వ్యాపారం చేయరాదనియు, వ్యాపారం చేయదలచుకుంటే కాంగ్రెసు సంస్థలందు బాధ్యతగల ఉద్యోగాలు, శాసనసభ్యతలు వదలుకోవాలనియు, మద్య నిషేధం కేసులు దొంగవ్యాపారం కేసులందు కాంగ్రెసు సభ్యులగు న్యాయవాదులెవ్వరు నేరస్థుల తరఫున వాదించరాదనియు, తీర్మానించబడెను. తిరువాంకూరులో తమిళప్రాంతం తమిళకాంగ్రెసు సంఘంక్రింద చేరాలనియు తీర్మానించ కరువుప్రాంతాలంగు రయితులకు చవుక వడ్డీరేట్లకు ఋణమివ్వాలని ప్రభుత్వంవారిని కోరుచు తీర్మానించబడెను.

## ధాన్యసేకరణ ఆర్డరు

మదరాసు, నవంబరు 16: మదరాసు ధాన్యసేకరణ ఆర్డరు (1948) నవంబరు 15 తేదీనుండి యీ దిగువ జిల్లాలలో అమలు జరుగునని అసాధారణ గజిటు నేడు ప్రకటించబడింది!

ద. ఆర్కాడులో చిదంబరం తప్ప తక్కిన తాలూకాలన్నింటియందు, బియ్యం, ధాన్యం.

మధుర, చిత్తూరు, సేలం జిల్లాలందు ధాన్యం. బియ్యం, జొన్నలు.

విశాఖ, చెంగల్పటు, ఉత్తర ఆర్కాటు, కోయంబత్తూరు, రామ్నాడు జిల్లాలందు యీ ఉత్తరువు డిశంబరు 15 నుండి అమలులోకి వచ్చును. ధాన్యం, బియ్యం, జొన్నలు సేకరించబడును. జొన్నలతోబాటు రాగులు, కంబు, కొర్ర, సామాయి, వరగు, విరిగలుకూడ సేకరించబడును.

### దత్తమండలాల ఆర్థిక అభివృద్ధి సంస్థ

మదరాసు ప్రభుత్వంవారు దత్తమండలాల ఆర్థికాభివృద్ధి సంస్థను పునరుద్ధరింప దలచిరి. దీనికి పరిశ్రమల శాఖా మంత్రి అధ్యక్షులుగ నుందురు. 5 గురు శాసన సభ్యులు, 5 గురు ఉద్యోగేతరులు సభ్యులుగ నుందురు. రాయలసీమ డెవలపుమెంటు కమిషనరు నొకని నియమింతురు. అతను బోర్డు కార్యదర్శిగ నుండును. క్రొత్తబోర్డు సభ్యులు నియమింపబడేవరకు ప్రాత సభ్యులు పనిచేయుచుందురు.











Edited, Printed & Published by S. Sambhu Prasad at the Andhra Patrika Press, No. 7, Thambu Chetty St, G. T. Madras.